## చిరంజీవిగారి సాహితీ ప్రవంతి

కర్రా చెప్పులు........

బడి పంతులు....

మందారాలు....

ఏకలవ్య....

కీలుబొమ్మ....

## — త్వరలో —

సఖీచింతన........

రక్తగోవా........

బంగారుచాలు........

పెళ్లికూతురు... ....

అగ్నిమీళే పురోహితమ్........


వివరములకు :

**వినోదాపబ్లికేషన్స్**

**విజయవాడ-2.**

## * పాత్రలు *

మాధవుడు

అమల్

సుధ

ధన్వంతరి

పాలవాడు

చౌకీదారు

తాత

మున్సబు

చోపుదారు

రాజవైద్యుడు

రెండు రంగాలు

స్థలం: మాధవుడి ఇంటోగది.

# రాజుగారి జాబు

## ఒకటో రంగం

# ఒకటో రంగం

[ మాధవుడి ఇంటో ]

మాధవ

ఏం చెప్పమంటారు నా గొడవ? వీడీ కొంపకు రాకముందే గొడవా లేదు. కడుపులో చల్ల కదలకుండా ఉన్నాను. వీడు ఎక్కణ్ణించి ఎలా వొచ్చాడో పైనున్న ఆ పెరుమాళ్ళ కే ఎరుక! వొచ్చి, నా ప్రాణానికి అంకె వేసుకున్నాడు. ఇప్పుడిహ- వీడే లేకపోతే- ఈ ఇల్లు ఇల్లే కాదు........అయ్యో ధన్వంతరిగారూ....ఏం విటా లోచిస్తున్నారు?.... ఇంతకీ వీడు....

ధన్వంతరి

అదృష్టముంటే - ఆయువుంటుంది, భూమ్మీద నూకలుంటాయ్. ఇంతకీ వైద్యశాస్త్రంలో ఏం వని రాసి వుందంటే....

మాధవ

చెప్పండి బాబూ ఏం వనిరాసివుంది?

ధ న్వం త రి

ఏఁవంటే విను, 'కఫ వాతములయందు కరముద్భ విల్లు పైత్య సన్ని....'

మా ధ వ

శాస్త్రాల సంగతి అలావుంచండి మీ పున్నెం. వాటిని చదివి నన్ను గాభరాపెట్టకండి! ఇపుడు నన్నేం చెయ్యమంటారో సెలవీయండి!

ధ న్వం త రి

[పొడుం పట్టు పట్టి]

రోగిని బహు జాగ్రత్తగా చూడవలసివుంది!

మా ధ వ

అంటే, చెప్పండి బాబయ్యా!

ధ న్వం త రి

లోగడే చెప్పాను. రోగి గడపదాటి అడుగు బయట పెట్టడానికి వీల్లేదు!

మా ధ వ

రోజు రోజంతా ఈ గదిలోనే పడి వుండాలిసిందే! అబ్బ, ఎంత ఇబ్బంది!

ధ న్వం త రి

అంటే నీ వుద్దేశ్యం ?....ఈచలికాలపు ఎండాగాలీ

ఉంది చూశావ్, మహావిషం అనుకో! అసలు శాస్త్రంలో ఏముందంటే—'జ్వర మూర్ఛ రోగాది సంకటములను'....

మా ధ వ

ఆ పద్యాల్ని కాస్త కట్టిపెడుదురు! గదిలో పడేసి ఉంచడం తప్ప మరోమార్గం లేదంటారా?

ధ న్వం త రి

లేదు, లేదు, ముమ్మాటికీ లేదు! శాస్త్రంలోఏమని ఉందంటే - 'ఎండయు గాలియు మెండు....'

మా ధ వ

ఈ ఎండా బెండుల్తో నన్నేం చావమంటారు? చెయ్యవలసిందేమిటో ఖచ్చితంగా చెప్పేద్దురూ! అదే చేస్తాను. మీ కషాయాలు గిషాయాలు చూసి కుర్రాడు బెదిరిపోతున్నాడు. రోగబాధకంటే ఈ చేదు కషాయాలబాధ వాడి ప్రాణానికి వొచ్చింది! వాడి బాధ చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతోంది.

ధ న్వం త రి

మందు ఎంత చేదుంటే అంత మంచిదని గుర్తుంచుకో! రోగి ఎంత బాధపడితే అంత మంచిదికూడా. ఇంతకీ చ్యవన మహర్షులవారు ఏమని సెలవిచ్చా

రంటే - విను, 'హితవాక్య మౌషధ మెంత చేదైన
నంత ఫలము'....సరే, వెళ్లొస్తాను మరి !

[ధన్వంతరి వెళిపోతాడు. తాత వస్తాడు.]

మా ధ వ

సరిపోయింది. నాపాలిటికి తాత వొకడు దాపరిస్తు
న్నాడు !

తా త

ఎందుకయ్యా నేనంటే నీకంత ఇది ?

మా ధ వ

నువు పిల్లల బుద్ధుల్ని తారుమారు చేసే తంత్ర
గాడివి.

తా త

కాని, నువ్వు కుర్రాడివి కావుగా ! నీ ఇంటో పిల్లా
జెల్లా లేరు. మరెందుకో భయం ?

మా ధ వ

హు.... ఈ మధ్యనే ఓ కుర్రాణ్ణి తీసుకొచ్చాను.

తా త

ఏఁవిటీ ? చెప్పు చెప్పు !

మా ధ వ

మా ఇంటావిడ ఓ కుర్రాణ్ణి పెంచుకుందామో అని
గోల పెడుతుండేది, నీకు గుర్తుంది కదూ ?

తా త

అబ్బో, అదెప్పటి మాటో కదా! ఆవిడ కావా లనడం, నువ్వు ససేమిరా అనడం...

మా ధ వ

ఎంత కష్టపడి ఈ నాలుగు డబ్బులు ముడేశానో నీకు తెలుసు. ఎవడో దారినపోయే దానయ్య లాగా ఓ కుర్రాడు వొచ్చి ఈ డబ్బుల్ని స్వాహా చేస్తానంటే- నా ప్రాణం వొప్పుతుందా భాయ్! ఉహుఁ! నాకీవరస బొత్తిగా గిట్టదు! కాని వీడుమాత్రం ఎలా నాప్రాణా నికి అంకె వేశాడో నీకు తెలుసా?

తా త

అదటయ్యా అసలు సంగతి? ఇహ ఎంత ఖర్చ యితే నీకు అంత ముచ్చటన్నమాట!

మా ధ వ

ఇన్నాళ్లు సంపాయించడమే పని. ఆ సంపాదనే లేకపోతే పిచ్చెత్తేది! ఇహఇప్పుడు ఈ సంపాదన అంతా ఈ కుర్రాడికే కదా అని మరింత హుషారుగా ఉంది.

తా త

బావుంది. ఇంతకీ ఈ కుర్రాణ్ణి ఎక్కణ్ణించి తీసు కొచ్చారేఁవిటి?

మాధవ

ఇంటావిడ పుట్టింటికి వెళ్ళినప్పుడు అక్కడనించి తీసుకొచ్చింది. చిన్నప్పుడే వీడి తల్లి పోయింది. ఈ మధ్యనే తండ్రికూడా కాలం చేశాడు.

తాత

పాపం! నేను అతన్నోమారు చూడాలే.

మాధవ

నిండా లొడితెడు లేడు. వాడి వంటో వాతం పిత్తం, శ్లేష్మం అన్నీ ఘోరయుద్ధం చేస్తున్నాయని ధన్వంతరిగారన్నారు. ఆయువుంటే తప్ప ఆశకూడా అట్టే లేదన్నారు. ఒక్కటే మిగిలివుంది. ఈ చలి కాలపు ఎండాగాలీ తగలకుండా ఉంటే - అప్పటి కేమన్నా ఆశ! మరి, నువ్వేమో ఇంటో పిల్లల్ని వీధిలోకి లాగుతావయ్యో! అంచేతే నువ్వంటే జడు స్తున్నాను.

తాత

నువ్వన్నది నిజమే ... ఈ కాలం ఎండాగాలి లాగానే వుంది నా సంగతీను! కాని వో మాట. పిల్లలు కాలు కదిపే పనిలేకుండా ఉంటే ఆటపాటలుకూడా నాకు తెలుసు! కాస్త నా పనీపాట చూసుకుని ఇపుడే వొస్తా. మీ వాడితో జత కలపాలి.

[తాత వెళిపోతాడు.అమల్ వస్తాడు]

అ మ ల్

మాఁధవయ్యా!

మా ధ వ

నువ్వా అమల్!

అ మ ల్

అలా వాకిట్లోకన్నా కూడా వెళ్ళకూడదా?

మా ధ వ

వొద్దుబాబూ, వొద్దు!

అ మ ల్

చూడు మాఁధవయ్యా, అక్కడత్తయ్య పిండి విసురుతోంది. అక్కడికి వెళ్ళనా? అదుగో ఉడత! చూడు మాఁధవయ్యా! తోక ముడుచుకున్కుచుని పప్పు బద్దల్ని బలేగా తింటోంది. అక్కడికి పోనా?

మా ధ వ

వొద్దుబాబూ వొద్దు.

అ మ ల్

నేనే ఉడతనైపోతే, ఎంతబావుంటుందీ? బలే.! నన్ను బయటికి వెళ్ళనీయవుగా మాఁధవయ్యా?

మా ధ వ

బయటికి వెళితే జబ్బు చేస్తుందని ధన్వంతరిగారు చెప్పారు నాయనా!

అ మ ల్

ఆయన కెలా తెలుసు మాఁవయ్యా?

మా ధ వ

బలే ప్రశ్న: ధన్వంతరిగారికి తెలీకపోవడ మేఁవిటి? బోలెడు పుస్తకాలు చదివాడు కదా!

అ మ ల్

పుస్తకాలు చదివితేనే అన్ని విషయాలు తెలిసి పోతాయా?

మా ధ వ

సరిసరి! ఆ మాత్రం తెలీదూ నీకు?

అ మ ల్

[నిట్టూర్చి]

ఏమీ చదువుకోనివాణ్ణాయె! అంచేతనే నాకేమీ తెలీదు.

మా ధ వ

చూడు అమల్! పెద్దపెద్ద పండితులున్నారే... వాళ్లు నీలాగే ఎప్పుడూ ఇల్లొదిలి బయటికి వెళ్ళనే వెళ్ళరు సుమీ!

అ మ ల్

నిజంగా వెళ్ళనే వెళ్ళరా ?

మా ధ వ

ఉఁహు, ఎలా వెళతారు చెప్పు ! కూచున్నచోటు నించే కదలకుండా ఒకటే చదువు చదువు ! బండెడు పుస్తకాలు ముందర వేసుక్కూచుంటారు ! చిట్టి బాబూ ! నువుకూడా పెద్దవాడివయాక పెద్ద పండితుడివవుతావు. పెద్ద పెద్ద పుస్తకాలు చదివేస్తావు. నిన్ను చూసినవాళ్ళంతా ముక్కుమీద వేలేసుకుని ఆశ్చర్యపోతారు.

అ మ ల్

వొద్దు వొద్దు మావయ్యా. నీ కాళ్ళు పట్టుకుంటాను నాకు చదువు వొద్దు చట్టుబండలూ వొద్దు !

మా ధ వ

అదేం నాయనా ? నేనే పండితుణ్ణయి వుంటే ఎంతో బాగుపడివుందును !

అ మ ల్

నాకొద్దు! ....ప్రపంచమంతా తిరిగొస్తాను, ఎక్కడెక్కడ ఏఁవేఁవి ఉన్నాయో కళ్ళారా చూసివస్తాను.

మా ధ వ

చూస్తావా ? ఏఁవుంటుంది చూడ్డానికి అమల్ !

అ మ ల్

మన కిటికీదగ్గర కూచుని చూస్తుంటే, దూరాన కొండ, ఆ కొండల్ని దాటి అలా వెళిపోవాలని ఉంది నాకు.

మా ధ వ

ఏఁవిటా పిచ్చిమాటలు! పనీ పాటలేక ఆ కొండ దాటి వెళతావా? నీమాటలేం బావుండలేదోయ్. ఆ కొండ అంత ఎత్తున అక్కడెందుకుందో ముందు తెలుసుకో. వచ్చిన వాళ్ళతో 'వెనక్కిపొండి' అని చెప్పడానికే. కాకపోతే పెద్ద పెద్ద బండల్ని పడేసుకుని ఎందుకుందనుకున్నావ్?

అ మ ల్

నువ్వలా అనుకుంటున్నావ్. కాని, నిజం ఏమిటో నాకు తెలుసు. ఆ కొండ ఏంచేస్తోందంటే, చేతులెత్తి ఆకాశాన్ని పిలుస్తోంది. భూమి ఎలానూ మాటాడదు గామరి! ఎక్కడో ఇళ్ళల్లో కిటికీలవద్ద ఒంటరిగా కూచున్నవాళ్ళకి మిట్టమధ్యాన్నంవేళ ఆ పిలుపు వినిపిస్తుంది! పెద్ద పెద్ద పండితులికిమాత్రం ఆ పిలుపు వినిపించదు!

మా ధ వ

వాళ్ళు నీలాంటి పిచ్చివాళ్ళుకాదుగా, అంచేత ఇలాంటి చెత్త వాళ్లకి వినపడదు.

అ మ ల్

మాఁవయ్యా, నాలాంటి పిచ్చివాడే నిన్న కనుపించాడు.

మా ధ వ

నిజం ? వాడి సంగతేఁవిటో చెప్పు !

అ మ ల్

భుజమ్మీద కఱ్ఱ, కఱ్ఱ చివర మూట, ఎడం చేతిలో చెంబు. పాతచెప్పులు తొడుక్కున్నాడు. ఆ మైదానంమీంచి కొండవేపు వెళుతూంటే పిలిచి 'ఎక్కడికి వెళుతున్నా'వని అడిగాను. 'ఎక్కడికో నాకే తెలీదు' అన్నాడు. మళ్ళా 'ఎందుకు వెళుతున్నావు ?' అనడిగాను. 'ఎక్కడన్నా పనిచూసుకుందామని' అని అన్నాడు. మాఁవయ్యా, పనికోసం వెతుక్కుంటూ పోవాలా చెప్పు !

మా ధ వ

ఔనుమరి పనికోసం ఎంతమంది తిరగడంలేదు కనక !

అ మ ల్

బలే ! వాళ్ళకుమల్లే నేనూ పనీపాటలకోసం తిరి గొస్తాను.

మా ధ వ

మాటవరసకి–ఎంతతిరిగినా పనిదొరకదనుకో....

అ మ ల్

దొరక్కపోతే మరీ బాగు : ఇంకా ఇంకా తిరుగు తుంటాను....సరే కాని మాఁవయ్యా ! ఆ తర్వాత ఏం జరిగిందంటే....చూస్తుండగానే పాతచెప్పులు తొడు క్కున్న మనిషి వెళిపోయాడు. ఏటిగట్టున మర్రి చెట్టుకింద మూటదించుకున్నాడు. ఏట్లో కాళ్లూ చేతులు కడుక్కొన్నాడు. మూట వూడదీశాడు. అటుకులు బెల్లం తీసి తిన్నాడు. తినేసి మూటకట్టాడు. భుజానికి తగిలించాడు. పంచె పైకెగగట్టి ఆవళాన ఏరుదాటు కుంటూ వెళిపోయాడు. మాఁవయ్యా ! నేనూ వెళి పోయి, ఏటొడ్డున అటుకులు తినేస్తాను. ఈమాట అత్తయ్యను అడిగేశానుకూడా.

మా ధ వ

మీ అత్త ఏఁవంది ?

అ మ ల్

అత్తయ్య అందికదా 'నీకు జబ్బు తగ్గగానే ఏటొడుకు తీసుకుపోయి అటుకులు తినిపిస్తాను!' అని. మాధవయ్యా, నా జబ్బెప్పుడు తగ్గిపోతుందో చెప్పు !

మా ధ వ

చప్పునే నయమవుతుంది.

అ మ ల్

నిజం ! నయం కాగానే వెళిపోతాను.

మా ధ వ

ఎక్కడికి వెళతావు ?

అ మ ల్

ఆ ఏటిదగ్గరకు పోతాను. నీళ్లలో కాళ్లు ముంచుతాను. ఏరుదాటేసి వెళిపోతాను, మధ్యాహ్నంవేళ తలుపులు వేసుకుని అందరూ పడుకునేవేళ-పనిపాటలు వెతుక్కుంటూ అలా వెళతాను.

మా ధ వ

అలాగా! ముందు నీజబ్బు నయంకానీయ్.

అ మ ల్

తీరా నయమయ్యాక, పండితుణ్ణికమ్మని అనవు గందా మాధవయ్యా?

మా ధ వ

మరి నీకేం కావాలని ఉందో చెప్పు.

అ మ ల్

ఇప్పుడేం తోచకుండా ఉంది. తర్వాత చెబుతాను.

మా ధ వ

అలాగే. దోవనుపోయేవాళ్లని పిలవడం, కబుర్లాడ్డం కట్టిపెడతావుకదూ?

అ మ ల్

వాళ్లంటే నాకెంతో ఇష్టం.

మా ధ వ

వాళ్లు నిన్నెత్తుకుపోతే ?

అ మ ల్

మరీ బావుంటుంది. అందరూ ఇంటో కూచోమనేవాళ్ళేకాని, ఒక్కరూ తీసుకుపోతామనరు !

మా ధ వ

పని చూసుకొస్తానుబాబూ. నువు బయటికి వెళ్ళకూడదుసుమా !

అ మ ల్

ఉహుం వెళ్లను. కాని, వీధివేపుగదిలో కూచుని, చూస్తుంటాను మాంవయ్యా.

(మాధవుడు వెళిపోతాడు.)

పా ల వా డు

పెరుగోయమ్మ పెరుగూ ! తీయన్నీ పెరుగూ !

అ మ ల్

ఓ పెరుగూ....ఇలారా....

పా ల వా డు

ఎందుకు పిలుస్తావ్ ? పెరుగు కొంటావా ?

అ మ ల్

డబ్బుల్లేవు. ఎలా కొంటాను ?

పా ల వా డు

బలేకుఱ్ఱాడివి. ఎందుకు పిలిచావు. అసలే నాకు ఆలస్యమవుతుంది.

అ మ ల్

రాగలిగితే నీతో వచ్చేద్దును.

పా ల వా డు

నాతోనా ?

అ మ ల్

ఆఁ. దూరాన్నుంచి కేకలేసుకుంటూ నువు పోతూంటే, నా కెలా ఉంటుందీ ?

పా ల వా డు

(కా వ డి దిం చి)

ఇక్కడ కూచుని ఏంచేస్తుంటావ్ నాయనా ?

అ మ ల్

ధన్వంతరిగారు కదలకూడదని చెప్పారు. రోజంతా ఇక్కడే కూచుంటాను.

పా ల వా డు

పాపం, ఏంవయింది నీకు ?

అ మ ల్

తెలీదు. నేనేం చదువుకోలేదుగా. అంచేత ఏంవయిందో ఏంవిటో నాకు తెలీదు. ఎక్కణ్ణుంచి వొస్తున్నావు ?

పా ల వా డు

మా ఊరి నించి.

అ మ ల్

మీ ఊరి నించా ? ఇక్కడికి చాలదూరం కదూ ?

పా ల వా డు

అవును. పాంచ్-మురా కొండ దిగువున, శామ్లీ నది వొడ్డున—

అ మ ల్

పాంచ్‌మురా కొండ, శామ్లీనది ! బలే ! మీ ఊరు చూసేవుంటాను. ఎప్పుడు చూశానో గుర్తురావడం లేదు.

పాలవాడు

చూశావా? ఆ కొండదగ్గరికి వెళ్లావా?

అమల్

ఉహుఁ! కాని, వెళ్ళినట్టు, చూసినట్టేఉంది. పెద్ద పెద్దచెట్లు, ఎఱ్ఱరోడ్డు పక్కనేగా మీ ఊరు?

పాలవాడు

అవును బాబూ!

అమల్

కొండ వాలులో గొడ్లు మేస్తుంటాయికదూ?

పాలవాడు

బలేగావుందే! నిజంగానే గొడ్లు మేస్తుంటాయ్.

అమల్

ఎఱ్ఱ చీరలు కట్టుకొని, చక్కా నెత్తిమీద నీళ్ళ కుండ లెత్తుకొని ఆడవాళ్లు ఏటి రేవులోంచి వెళు తుంటారు!

పాలవాడు

సరిగా చెప్పావ్ బాబూ! మా పల్లెవాళ్లంతా ఏట్లోంచే నీళ్లు తీసుకొస్తారు! అయితే అందరూ ఎఱ్ఱ కోకలే కట్టుకోరనుకో! తతిమ్మాదంతా నువు చెప్పి నట్టే సుమీ! ఎప్పుడో అటు షికారు వెళ్ళి వుంటావు నువు!

అ మ ల్

అబ్బ! నేనెప్పుడూ వెళ్ళనేలేదు. బయటికి వెళ్ళ వచ్చు, అని ధన్వంతరిగారు చెప్పగానే - నన్ను మీ ఊరు తీసుకెళ్ళవూ ?

పా ల వా డు

తప్పకుండా తీసుకుపోతాను బాబూ !

అ మ ల్

భుజంమీద కావిడేసుకుని, ఆ రోడ్డుమీంచి నీలాగే పాలూ పెరుగమ్మడం - ఎలాగో నాకు నేర్పవూ ?

పా ల వా డు

పెరుగమ్ముతావా ! వొద్దుబాబూ ! పెద్ద పెద్ద పుస్తకాలు చదివి గొప్పవాడివైపో.

అ మ ల్

ఊహుఁ, పుస్తకాలు వొద్దు, పెద్ద పెద్ద చదువులూ వొద్దు. నీలాగే రేపల్లెవాడనించి పెరుగు తీసుకుని, ఆ చెట్లపక్క, రోడ్డుమీంచి ఇంటికిపోయి అమ్ముకొస్తాను. నువు బలేగా అంటావు: 'పెరుగు పెరుగోయమ్మ, తీయన్ని పెరుగూ'అని. ఆ మాదిరి నాకూ నేర్పవూ ?

పా ల వా డు

అది నేర్పమంటావా, ఏంమాటలు నాయనా ?

అ మ ల్

నేర్పవా ? నీ కేక ఎంతో తీయగా వుంటుంది. ఆకాశం అంచుల్లో ఎగిరే పక్షిపాట వింటూన్నట్టుం టుంది మనసుకి. ఆ రోడ్డు మలుపులో, చెట్లబారు దగ్గరగా నువు కేకేస్తుంటే, నా మానసు ఇదవుతుంది !

పా ల వా డు

బాబూ. ఇదుగో కొంచెం పెరుగు తింటావా ?

అ మ ల్

నా వద డబుల్లేవుగా !

పా ల వా డు

వొద్దు వొద్దు. డబ్బు సంగతే ఎత్తకు. నువు నా పెరుగు కాస్త తాగితే చాలు, అదే పదివేలు నాకు!

అ మ ల్

నీకు బాగా ఆలస్యమైపోయింది కదూ ?

పా ల వా డు

లేదు, ఏమాత్రం ఆలస్యం నష్టం కాలేదు. పెరు గమ్మడంలో ఎంత హాయి ఉందో ఇవాళ నీ నించి నేర్చుకున్నాను బాబూ!

[వెళిపోతాడు]

అ మ ల్

[కూనరాగంతో]

పెరుగోయమ్మ పెరుగు! తీయన్ని పెరుగు! పాంచ్ - మురా కొండ పక్క, శామ్లీనది వొడ్డునే - రేపల్లెవాడ దీ పెరుగు! పెరుగూ తీయన్ని పెరుగు! రేపల్లె తల్లులు, పొద్దుటే చెట్లకింద ఆవుల్ల పాలన్ని పిండేరు. సంజేళ తోడెట్టారు! పెరుగూ తీయన్ని పెరుగు....అడుగో చౌకీదారు! ఓ చౌకీదారూ! చిన్న మాట!

చౌ కీ దా రు

ఎందుకలా అరుస్తావ్? నేనంటే భయంలేదూ నీకు?

అ మ ల్

లేదు, ఎందుకు భయం?

చౌ కీ దా రు

నిన్నెత్తుకుపోతా ననుకో....

అ మ ల్

ఏక్కడి కెత్తుకు పోతావ్? చాలా దూరంగానా? ఆ కొండ వెనక్కెనా?

చౌ కీ దా రు

రాజుగారి దగ్గరికి!

అ మ ల్

రాజుగారి దగ్గరకా? తీసుకు వెళతావూ? మరి, ఈ ధన్వంతరి నన్ను కదలనీడు!....ఎవరూ తీసుకు వెళ్లలేరు! రోజంతా నేనిక్కడే పడివుండాలి!

చౌ కీ దా రు

ధన్వంతరి కదలొద్దన్నాడూ? సరి. నీ ముఖం వాడిపోయింది, కళ్లచుట్టూ నల్లగా మచ్చలు: చేతులు సన్నబడి నరాలు కనిపిస్తున్నయ్యే!

అ మ ల్

చౌకీదార్, గంటకొట్టవూ?

చౌ కీ దా రు

ఇంకా వేళ కాలేదు.

అ మ ల్

ఏఁవిటో మరి కొందరు ఇంకా వేళకాలేదంటారు! మరికొందరేమో 'అయిపోయిందప్పుడే' అంటారు: నువు గంట కొడితే సరి వేళవుతుంది.

చౌ కీ దా రు

అబ్బే ఉత్తది! వేళయినప్పుడే గంట కొడతాను.

అ మ ల్

అవునవును! ఆ గంటలమోత ఎంతబావుంటుందీ! మధ్యాహ్నం భోజనాలయ్యాక, మావయ్య పనిమీద

వెళిపోతాడు. అత్తయ్య రామాయణం చదువుతూ నిద్రపోతుంది. చూరుకింద తోక ముడుచుకుని మా కుక్క పడుకుంటుంది. అప్పుడు - టంగ్ టంగ్ టంగ్ మని నీ గంట కొడుతుంది. ఎందుకలా కొడుతుందో చెప్పవూ?

చౌకీదారు

'ఎవరికోసం కాలం ఆగదు, అలా వెళిపోతూం టుంది.' అని నా గంట అందరికీ చెబుతుంది.

ఆమల్

ఎక్కడికి, ఏ సీమకి వెళుతుంది ?

చౌకీదారు

ఎవరికీ తెలీని చోటికి !

అమల్

అక్కడికి వెళ్లొచ్చిన వాళ్లెవరూ లేరు కదూ ! ఆ కాలంతోపాటే ఎవరికీ తెలీని ఆ దూర దూర సీమ లకి నేనూ ఎగిరి పోదామని వుంది!

చౌకీదారు

అందరమూ అక్కడకే ఓ రోజున వెళిపోతా మబ్బాయీ!

అమల్

నేనుకూడానా ?

చౌ కీ దా రు

నువుకూడా.

అ మ ల్

మరి ధన్వంతరి నన్ను కదలనివ్వడే!

చౌ కీ దా రు

ఆ ధన్వంతరే ఓ రోజున నిన్నుస్వయంగా తీసుకుపోతాడు!

అ మ ల్

తీసుకుపోడు! అతణ్ణి గురించి నీకు తెలీదు. నన్నిక్కడే పడేసి వుంచుతాడు!

చౌ కీ దా రు

ఈ ధన్వంతరికంటే మహా ఘనుడింకోకడున్నాడు. అతడే వచ్చి నిన్ను తీసుకుపోతాడు.

అ మ ల్

ఆ పెద్ద ధన్వంతరి ఎప్పుడొస్తాడు? నా కిక్కడ పడి వుండడం ఏం బాగో లేదు!

చౌ కీ దా రు

ప్చ్! అలాంటి మాటలనకయ్యా!

అ మ ల్

ఉహూ: కాలు కదపకుండా ఇక్కడే కూచున్నాగా! టంగ్ టంగ్ టంగ్ మని నీ గంట కొడుతూంటే నా కెలా ఉంటుందనుకున్నావ్? చెప్పు చౌకీదార్!

చౌకీదారు

ఏఁవిటి నాయనా:

అమల్

చూడు! ఆ పెద్దమేడవేపు జెండా ఎగురుతోంది! జనం వస్తూ పోతున్నారు! అది....

చౌకీదారు

ఓ అదా! మన కొత్త పోస్టాఫీస్!

అమల్

పోస్టాఫీసా? ఎవరిది?

చౌకీదారు

ఎవరిదీ? రాజుగారిది!

అమల్

ఆ పోస్టాఫీసుకి జాబులన్నీ రాజుగారి దగ్గరనించే వస్తాయా?

చౌకీదారు

ఆఁ.... ఓ రోజున అక్కడినించి నీకో జాబు వస్తుంది!

అమల్

నాకో జాబా? మరీ చిన్న కుర్రాణ్ణిగా!

చౌకీదారు

రాజుగారు చిన్నవాళ్లకి చిట్టి చిట్టి జాబులు రాస్తారు!

అ మ ల్

బలే ! నా కెప్పుడొస్తుందో ? ఆయన నాకు రాస్తా రని నీ కెలా తెలుసు ?

చౌ కీ దా రు

మరెందుకనుకున్నావ్ ! నీ కిటికీతిన్నగా బంగారు జెండాకట్టి పోస్టాఫీస్ ఎందుకుపెట్టారని ?

అ మ ల్

మరి రాజుగారు రాసిన జాబు నా కెవరు తెచ్చిఇస్తారు ?

చౌ కీ దా రు

రాజుగారి వద్ద బోలెడుమంది పోస్టు బంట్రోతు లున్నారు. ఇత్తడి బిళ్ళలు తగిలించుకుని వెళుతుం టారు, వాళ్ళని నువ్వు చూడలేదా ?

అ మ ల్

వాళ్ళలా ఎక్కడికిపోతూంటారు ?

చౌ కీ దా రు

ఇంటింటికి ! అలా దేశమంతా తిరుగుతారు.

అ మ ల్

నేను పెద్దయ్యాక రాజుగారి పోస్టుబంట్రోతు నవుతాను.

చౌ కీ దా రు

హో, హో! బంట్రోతుపనా? బావుంది! ఎండలో వానలో గొప్పింటికీ, పేదింటికీ-ఇంటింటికీ వెళ్ళి ఉత్త రాలు ఇవ్వాలి. మంచి ఉద్యోగమే!

అ మ ల్

ఎందుకు నవ్వుతున్నావ్, నా కలాంటి పనంటేనే చాల ఇష్టం! నీ ఉద్యోగంకూడా గొప్పదేసుమీ! మిట్టమధ్యాహ్నం ఎండ నిప్పులు చెరిగేవేళ నీ గంట టంగ్ టంగ్ టంగ్ మని కొడుతుంది. ఒక్కోసారి నడిరాత్రివేళ నాకు చప్పున మెళకువ వస్తుంది. చూస్తే దీపాలుండవు. బయట కటికచీకట్లోంచి టంగ్ టంగ్ టంగ్ మని నీ గంట వినిపిస్తుంది.

చౌ కీ దా రు

అడుగో మున్సబ్ వొస్తున్నాడు. వెళిపోతాను. నీతో బాతాఖానీ కొడుతూండగా చూశాడా నాకొంప మునిగిందే!

అ మ ల్

మున్సబా? ఎక్కడ?

చౌ కీ దా రు

అడుగో తిన్నగా రోడ్డుమీద! తాటాకు గొడుగు వేసుకురావడంలా....ఆయనే!

అమల్

ఆయనకు మున్సబుగిరి రాజుగారిచ్చారా ?

చౌకీదారు

ఆయనకి ఇచ్చేదేఁవుంది ? తనకు తానేమొగాణ్ణు ! తనంటే ప్రతివాళ్ళూ గడగడలాడేటట్టు చేస్తాడు. ప్రతివాడితో కుస్తీకి తయారు. తంపుళ్లకు పెట్టింది పేరు ! ఇహ నేను వెళిపోతాను. పనిపాటలు చూసుకోవద్దూ ? ఊళ్ళో సంగతులన్నీ మళ్లా రేప్పొద్దుటే వొచ్చి చెబుతాలే !

[వెళిపోతాడు]

అమల్

నాకు రోజుకో ఉత్తరం రాజుగారి దగ్గరనించి వొస్తూంటే ఈ కిటికీలో కూచునే చదువుతాను. హూ ! అన్నట్టు నేను చదవలేనుగా ! నాకెవరు చదివి పెడతారు ? అత్తయ్య రామాయణం చదువుతుంది. రాజుగారి జాబు చదవడం ఆవిడకి తెలుస్తుంది ! ఎవరూ చదివిపెట్టకపోతే అవన్నీ దాచుకుని పెద్దయాక నేనే చదువుకుంటాను. ఇంతకీ పోస్టు బంట్రోతు నన్నెరక్కపోతే....? మున్సబుగారూ, ఏఁవండోయ్ మున్సబ్‌గారూ, చిన్నమాట....

ము న్న బు

నడిబజార్లో నిలబెట్టి నన్ను, కేకేసే దెవర్రా ? ఓ....నువ్వా ? కోతి వెధవా....

అ మ ల్

మీరు మున్నబుగారే కదూ ! మీరంటే అందరికీ హడల్ ?

ము న్న బు

[సంతోషిస్తూ]

అదీ ! హడిలిపోవలసిందే... వాడెవడైనాసరే.

అ మ ల్

రాజుగారి పోస్టు బంట్రోతు మీ మాట వింటాడు కదూ ?

ము న్న బు

వింటాడా ? చచ్చినట్టు వినితీరవలసిందే. వాడేం విటి, వాడితల్లో జేజెమ్మ కూడా వింటుంది.

అ మ ల్

'అమల్, కిటికీదగ్గర కూచుంటాడు' అని పోస్టు బంట్రోతుకి చెబుతారా ?

ము న్న బు

ఎందుకో ?

అ మ ల్

నాకో ఉత్తరం వొస్తుంది.

ము న్న బు

నీకో ఉత్తరమా ? ఎవరు రాస్తారు ?

అ మ ల్

రాజుగారు రాస్తారు.

ము న్న బు

ఒహోహో, గట్టిపిండానివే! హెహె! రాజుగారు నీకు రాస్తారు, ఆయనకు నువ్వు ప్రాణమిత్రుడవాయె! ఈ మధ్య నిన్ను కలుసుకోక రాజుగారు మహా బెంగపడ్డారట! తెలిసిందిలే! రేపో మాపో తప్పకుండా నీకు ఉత్తరం వొస్తుందిలే!

అ మ ల్

అలా మాటాడుతున్నారేం మున్నబుగారూ! నా మీద కోపం వొచ్చిందా ?

ము న్న బు

అయ్యో బాబో, నీమీద కోపమే! నువ్వు రాజుగారికి జాబులు రాస్తుంటివాయె. . .మాధవుడికి కాస్త కొవ్వు పట్టిందీమధ్య! నాలుగు డబ్బులు మూటకట్టాడుగా! మాటాడితే మహారాజులమాటే ఇంటో! వాడి ఠంతే(.

విటో చూస్తాను. అన్నట్టు నీకు రాజుగారి ఉత్తరం తీసుకొస్తాను. తప్పకుండా తెచ్చి పెడతానురా బుల్లోడా!

అమల్

వొద్దొద్దు. మీ కెందుకా శ్రమ?

మున్సబు

ఎందుకని? నీ మాట చెప్పగానే రాజుగారు ఆవురుమని సంతోషించీ, నీ యోగక్షేమాలన్నీ విచారించడానికి తక్షణం నౌకర్ని ఉరికిస్తారు!—మాధవుడి పని మాంచి ఇదిగా వుందన్నమాట! ఈ మాట రాజుగారి చెవిని పడితే, ఆయనే వీణ్ణి సరిచేస్తారు!

[వెళ్ళిపోతాడు]

అమల్

ఎవరా పోతున్నది? గజ్జెలు గల్‌గల్లాడిస్తూ పోతున్నావు? కాస్త ఆగి మాటాడవూ?

[ఓ అమ్మాయి వొస్తుంది]

సుధ

నించోడానికి వీల్లేదు, ఇప్పటికే నాకు ఆలస్యమై పోయింది!

అ మ ల్

సరి ! ఆగాలని నీకు లేదు! ఇక్కడ కూచోవాలని నాకులేదు !

సు ధ

చూస్తూంటే నువు వేగుజుక్కలా ఉన్నావ్! ఏఁవ యిందేటి ?

అ మ ల్

తెలీదు. ధన్వంతరిగారు నన్ను కదలొద్దన్నారు !

సు ధ

ఐతే, కదలొద్దు ! ధన్వంతరిమాట వినాలి ! వినక పోతే అందరూ నిన్ను అల్లరబ్బాయంటారు ! తలుపులు తెరిచివుంటేఅ దేపనిగా వీధివేపు చూస్తూ, కూచుంటావ్. అంచేతనే అలిసిపోతున్నావ్. కిటికీ తలుపు వేసెయ్యనా ?

అ మ ల్

ఈ వొక్క రెక్కే తెరిచివుంది. తతిమ్మావన్నీ మూసేవున్నాయి. 'ఇంతకీ నువ్వెవరవో చెప్పవూ, గుర్తు రావడంలేదు !

సు ధ

సుధని !

అ మ ల్

సుధవా ?

సు ధ

పువులమ్మేవారమ్మాయిని, ఎరగవూ ?

అ మ ల్

ఏం చేస్తూంటావ్ ?

సు ధ

ఈ సెజ్జనిండా పువులేరుకొస్తాను.

అ మ ల్

ఓ, పువ్వులు తేవడానికా? అంచేతనే నడుస్తూంటే నీ పాదాలు అలా సంతోషంతో చిందులేస్తున్నాయి. గజ్జెలు గల్ గల్ మంటున్నయ్. నేను బయటికి రాగలిగితేనా ? చిటారుకొమ్మల నున్న పువ్వులు కోసి నీ కిస్తాను.

సు ధ

నిజంగా ! నాకంటే నీకే పువుల సంగతి తెలుసు!

అ మ ల్

ఔను, నా కెన్నో తెలుసుమరి ! వనదేవతకథా, ఏడుగురన్నదమ్ములకథా నాకు తెలుసు ! నన్ను వొదిలిపెడితేనా—అలా వెళిపోతాను. అడవిలోకి, కాకులుదూరని కారడవిలోకి, చీమలుదూరని చిట్టడవిలోకి. అక్కడ బులుబులులు ఉయ్యాలూగుతాయే, ఆచిటారుకొమ్మలో సంపెంగ పువ్వునైపోతాను. మరి నువు నాచెల్లి 'పారుల్'వి అవుతావా ?

సు ధ

బలేవాడివి ! 'పారుల్'ని ఎలా అవుతాను ? నేను సుధని, పువులమ్మే శశిగారమ్మాయిని. రోజూ లెక్కలేనన్ని దండల్ని గుచ్చాలిగదా ! నీతో ఇక్కడే కూచుని కబుర్లాడితే ఎంచక్కా ఉంటుంది !

అ మ ల్

అలాగే కూచోగలిగావనుకో. రోజంతా ఏంస్తావ్ ?

సు ధ

నాకో బుట్టబొమ్మ-పేరు వేణి-ఉంది. దానికి పెళ్ళి చేస్తాను. ఓ పిల్లి - పేరు మిణి - ఉందికూడా. . . సరి వెళతాను. ఆలస్యమైతే వొక్క పువ్వుకూడా దొరకదు !

అ మ ల్

ఇంకొంచెంసేపు వుండవా ? నువ్వంటే ఎంత్తో బావుంది !

సు ధ

అదుగో, మరి అల్లరి చెయ్యక కూచో. పువ్వులు తీసుకొని తిరిగి వొచ్చేటప్పుడు నీకు బోలెడు కబుర్లు చెబుతాను !

అ మ ల్

నాకో పువ్వు ఇచ్చి వెళతావా ?

సు ధ

ఉహుఁ, డబ్బుల్లేకుండా ఎలా ఇవ్వను ?

అ మ ల్

పెద్దవాణ్ణి అయ్యాక దాని ఖరీదిస్తాను. పనిపాటల కోసం ఆ ఏరుదాటి అటు వెళతానుగా! అప్పుడిస్తాను!

సు ధ

సరే.

అ మ ల్

పువులు తీసుకుని వొస్తావుకదూ ?

సు ధ

తప్పకుండా.

అ మ ల్

నిజంగానా ?

సు ధ

నిజంగా ముమ్మాటికీ.

అ మ ల్

మరిచిపోవుకదూ, నా పేరుఅమల్. గుర్తుంచుకో.

**సు ధ**

మరచిపోనన్నానుగా, నువ్వే చూస్తావ్.

[ సుధ వెళ్లిపోతుంది. కొంతమంది కుర్రాళ్ళు వొస్తారు. ]

అ మ ల్

మీరంతా ఎక్కడికి వెళుతున్నారు ? కాసేపు నించోరూ ?

కుర్రాడు

ఆడుకోడానికి పోతున్నాం.

అమల్

ఏమాటలాడుకొంటారూ ?

కుర్రాడు

పంటసిరి ఆట ఆడతాం.

మరో కుర్రాడు

(కర్రని చూపిస్తూ)

ఇది కోతేరు.

మరో కుర్రాడు

మేం ఇద్దరం జోడెడ్లం.

అమల్

రోజంతా ఇలాగే ఆడుకుంటారా ?

కుర్రాడు

ఓ రోజంతా....

అమల్

సాయంత్రం ఏటిదరి రోడ్డునే ఇళ్ళకు వెళతారా?

కుర్రాడు

ఊఁ.

అమల్

వెళ్ళేటప్పుడు మా ఇంటివేపునించి వెళ్ళరూ ?

కు ర్రా డు

బయటికి రారాదూ ! ఆడుకుందాం.

అ మ ల్

ధన్వంతరి నన్ను బయటికి రానీడు !

కు ర్రా డు

ధన్వంతరి: ధన్వంతరి చెప్పిందల్లా చేస్తూ కూచుంటావుకాబోలు!.... ఆలస్యమైపోతోంది, ఊఁ పదండిరా !

అ మ ల్

వెళ్ళొద్దు ! కిటికీ దగ్గరగా రోడ్డుమీద ఆడుకోండి, నేనూ చూస్తూ కూచుంటాను.

కు ర్రా డు

ఇక్కడేఁ ఆటలు ఆడుకోము ?

అ మ ల్

నా ఆట బొమ్మలన్నీ ఊరికే పడివున్నాయి. తీసుకోండి. ఒంటరిగా నేనాడుకోలేను. ఇవి నాకెందుకూ పనికిరావుకూడాను.

కు ర్రా ళ్లు

బలే ! ఎంతబావున్నాయి ఇవి ? చూడు, ఇదుగో ఓడ, అదుగో ముసలిజాతాయ్. ఈ సిపాయిల్ని

చూడండి! ఇవన్నీ మా కిచ్చేస్తున్నావా? మళ్లా అడగవూ? నిజంగా అడగనే అడగవూ?

అమల్

వొక్కటికూడా అడగను. అన్నీ తీసుకోండి.

కుర్రాడు

కావాలని మళ్ళా అడగవుగా?

అమల్

ఉహూం.

కుర్రాడు

ఇలా ఇచ్చేస్తే, నిన్నెవరూ కోప్పడరుకదా, చెప్పు!

అమల్

ఎవరూ నన్నేమీ అనరు! ప్రతీ సాయంత్రం వొచ్చి కాసేపు ఈ కిటికీ తిన్నగా ఆటలాడుకుని వెళ్లండి! ఇవన్నీ పాతవైపోతే - మళ్లా సరికొత్తవి కొని ఇస్తాను!

కుర్రాడు

ఓ, తప్పకుండా. ఈ సిపాయిల్ని వరసగా నించో పెెట్టండి. యుద్ధం ఆట ఆడదాం. ఈ సిపాయిలకి తుపాకు లెక్కణ్ణించి తెద్దాం? ఇలా చూడండి.

వీటినే ముక్కలు చేసి ఎలాగో తయారు చేద్దాం.... అరే, నువ్వప్పుడే నిద్రపోతున్నావే....?

అమల్

నిద్ర ముంచుకొస్తోంది. ఎందుకనో తెలీదు. అప్పు డప్పు డిలాగే వుంటుంది. పొద్దుట్నించీ కూచున్నా నేమో అలిసిపోయాను. వెన్ను లాగుతోంది.

కుర్రాడు

మిట్ట మధ్యాహ్నం అప్పుడే నిద్రపోతావా ? విను! మొదటి గంట వినుపిస్తోంది !

అమల్

అవును, టంగ్ టంగ్ టంగ్ మని, నన్ను నిద్ర పొమ్మని చెబుతున్నాయి గంటలు !

కుర్రాడు

మేం ఇపుడు వెళ్ళిపోవడమే మంచిది. మళ్లా రేపొద్దుటే వస్తాం.

అమల్

వెళ్ళేముందొక మాటడగనా ? మీ రెప్పుడు బయట తిరుగుతుంటారుకదా! మీకు రాజుగారు పోస్టుబంట్రోతు తెలుసునా ?

కుర్రాడు

ఓ, బాగా తెలుసు !

అ మ ల్

వాళ్ళెవరు ? వాళ్ళ పేర్లు చెబుతారా ?

కు ర్రా డు

ఆఁ....ఒకతని పేరు బాదల్.

మ రో కు ర్రా డు

మరొకతని పేరు శరత్.

మ రో కు ర్రా డు

వాళ్లు చాలామంది ఉన్నారు.

అ మ ల్

నాకో ఉత్తరం వస్తే - వాళ్లు నన్ను గుర్తుపట్టి నా కివ్వగలరా ?

కు ర్రా డు

ఉత్తరంమీద నీ చిరునామా ఉంటుందిగా! తప్పకుండా వాళ్లకి తెలుస్తుంది.

అ మ ల్

రేపొద్దున మీరు వచ్చేటప్పుడు - వాళ్లల్లో ఒక బంట్రోతుని తీసుకొస్తారూ ? నన్ను చూసి గుర్తుపెట్టుకుని వెళతాడు.

కు ర్రా డు

అలాగే, కావాలంటే తీసుకే వస్తాం !

[ తె ర ]

# రెండవ రంగం

[అమల్ పక్కమీద ఉన్నాడు.]

అమల్

మాధవయ్యా. ఇవాళ కిటికీ దగ్గరకే వెళ్లకూడదా? ధన్వంతరిగారు వెళ్లొద్దని చెప్పారా?

మాధవ

ఔను బాబూ! రోజు రోజూ అక్కడ కూచుంటే నీ ఆరోగ్యం మరీ పాడయింది.

అమల్

లేదు మాధవయ్యా! ఆరోగ్యం పాడయిన సంగతి ఏమోకాని, అక్కడ కూచున్నన్నాళ్లూ నా కెంతో హాయిగా వుంది!

మాధవ

ఊఁహూ: అదే వొద్దు. ఆబాలగోపాలాన్ని చేర్చి అడావుడి చేస్తూ కూచుంటావు. ఇదో వేలాం వెర్రికింద దిగింది. ఇదంతా రోగిష్టివి నువ్వు తట్టుకోగలవా? ఇలా చూడనీ, నీ మొహం ఎంత పాలిపోయిందో....

అ మ ల్

మాధవయ్యా, కిటికీ వద్ద కూచోకపోతే, ఆ ఫకీరు వొచ్చి నను చూడకుండానే వెళిపోతాడేమో !

మా ధ వ

ఫకీరా ? వాడెవడు బాబూ ?

అ మ ల్

అతనా ? వొస్తాడు. దేశదేశాల సంగతులన్నీ చెప్పి పోతుంటాడు మాధవయ్యా! ఆ కబుర్లు ఎంత బావుంటాయని !

మా ధ వ

ఎలా ? ఒక్క ఫకీరునీ నే నెరగనే !

అ మ ల్

సరిగ్గా ఫకీరు వొచ్చే వేళయింది. నీ కాళ్లుపట్టుకు బతిమాలుతాను ! ఫకీరు వొస్తే ఇక్కడికి వొచ్చి మాటాడమని చెప్పవూ ?

[తాత ఫకీర్ వేషంతో వొస్తాడు]

అ మ ల్

వొచ్చావా, ఇలా రా ఫకీర్, నా పక్కమీద కూచో !

మా ధ వ

బలే - ఇతను -

తా త

[సంజ్ఞ చేసి]

నేను ఫకీరుని -

మా ధ వ

నువ్వేం కావో నాకు ఏసంకూడా అంతు తెలీ కుండా వుంది.

అ మ ల్

ఈ సారి ఎక్కడికి వెళ్లావు ఫకీర్ !

తా త

చిలకల దీవికి వెళ్లాను. అక్కణ్ణించి ఇపుడే వస్తున్నా.

మా ధ వ

చిలకల దీవా ?

తా త

అంత ఆశ్చర్యపోతావేం ? నీలాంటి వాణ్ణను కున్నావా ? ఎక్కడికి వెళ్ళిరావాలన్నా నాకు దమ్మిడీ ఖర్చుకాదు. ఎక్కడికంటే అక్కడికి వెళ్ళిరాగలను !

అ మ ల్

[చప్పట్లు కొడుతూ]

ఎంత ఆనందమో నీది ! నయమయ్యాక నన్నూ వెంటపెట్టుకుని తీసుకు వెళతా నన్నావు, గుర్తుందా ?

తా త

ఆఁ. నీకు కావలసినన్ని ప్రయాణీకుల కిటుకులన్నీ నేర్పేస్తాను. సముద్రం, అడవీ, కొండ ఏదీ నీ దారికి అడ్డం కావు !

మా ధ వ

ఏఁవిటిదంతా పిచ్చివాగుఁడు ?

తా త

అమల్‌బాబూ, సముద్రమన్నా, పర్వతమన్నా నాకేం భయంలేదు. కాని మీ మాఁవయ్యతో ఆ ధన్వంతరి మళ్ళా కలిస్తేమాత్రం నా మంత్రం మాత్రం పని చెయ్యదోయ్ !

అ మ ల్

వొద్దు, మాఁవయ్యా! ఆ ధన్వంతరితో చెప్పకు ! నయమయ్యేదాకా కదలను. బాగా నయమయ్యాక ఫకీర్ వెంట వెళ్ళిపోతాను. సముద్రం, పర్వతం ఇవేవీ నా ప్రయాణానికి అడ్డం కావు !

మా ధ వ

'పోతాను పోతాను' అనకయ్యా, నాయనా ! నీ మాటలు వింటే నా గుండె తరుక్కు పోతూంది.

అ మ ల్

ఫకీర్ ! చిలకలదీవి ఎలా వుంటుందో చెప్పవూ ?

ఫ కీ ర్

అదా ! అడుగడుగున అద్భుతాలే అనుకో, మనుషులుండరు. అక్కడపక్షులదే పరిపాలన ! ఆటా పాటా కనిపించదు, వినిపించదు. అంతా పాటా, ఎగిరిపోవడం....అంతా....

అ మ ల్

ఎంత గొప్పగా వుందీ ! ఇంతకీ ఇది సముద్రం తర్వాతనేగా ?

తా త

ఔను, సముద్రం దాటాకనే.

అ మ ల్

అక్కడ నీలికొండలున్నాయి కదూ !

తా త

పక్షులుండేది ఆ నీలికొండలమీదనే ! కొండలమీద సంజవెలుగులు పడేవేళ, పక్షులన్నీపచ్చటి రెక్కల్ని చూచి గూళ్ళకు బయల్దేరుతాయి. బలేగా వుంటుంది.

అ మ ల్

అక్కడ జలపాతా లుంటాయా ?

తా త

ఇంకానయం బాబూ ! నీకు జలపాతం లేని కొండే కనిపించదు. వాటిని చూస్తుంటే వజ్రాల్ని కరిగించి

ధారపోసినట్టుంటుంది. ఆ జలపాతాలు నృత్యంచేస్తూ దూకుతాయి. బండల మీంచి సంగీతాలుతీస్తూ పోయి సముద్రములో దూకుతాయి. వాటిని ఆపడానికి ఈ ధన్వంతరి తాత కూడా చాతకాదు. నరమానవుణ్ణని నాకు పక్షులు కాస్త దూరంగా వుంటాయి. లేకపోతేనా వాటి గూళ్లపక్కనే నేనూ చిట్టిగూడు వేసుకొనేవాణ్ణి. పొద్దస్తమానం సముద్ర తరంగాల్ని చూస్తో కాలం గడిపేవాణ్ణి.

అ మ ల్

నేను ఓ పక్షినై ఉంటే ఎంత బావుండేదీ? అప్పుడు....

తా త

ఉఁహు. అది లాభంలేదు. నువు పాలవాడితో పెద్దయ్యావ్. పాలూ పెరుగూ అమ్ముతానని చెప్పు కున్నావని విన్నాను. పక్షుల దగ్గర నీ బేరసారాలు అట్టే గిట్టవు. నిజంగా నీకు బోలెడు నష్టం వస్తుందని నా అనుమానం!

మా ధ వ

మీ ఇద్దరి వైనాలు బొత్తిగా బాగుండలేదు. నేవెళి పోతా.

అ మ ల్

పాలమనిషి వొచ్చివెళ్ళాడా, మాధవయ్యా!

మా ధ వ

ఆఁ నీ ఫకీర్‌లాగా చిలకలదీవికీ ఇక్కడికీ షికార్లు కొడుతూ కూచుంటాడా పాలమనిషి! నీకని ఓ పెరుగు ముంత యిచ్చివెళ్ళాడు. ఇవాళ అతని మేన కోడలి పెళ్లట! హడావిడిగా వున్నాడు. బాండు మేళం బెత్తాయించటానికి 'కామ్లిపారా' వెళ్ళానని చెప్పమన్నాడు.

అ మ ల్

మరి, వాళ్ల చిట్టికోడల్ని నాకిచ్చి పెళ్ళిచేస్తా నన్నాడే!

తా త

బాబూ, ఇప్పుడు ఖాయంచేసుకుందామ్!

అ మ ల్

ఆ పిల్ల చిట్టి పెళ్ళికూతురవుతుందని నాకు చెప్పాడు. కెంపుల్లాంటి పోగులు పెట్టుకుంటుంది. ఎర్ర చీరె కట్టుకుంటుంది. పొద్దున్నే వాళ్ల నల్లావు పాలు పితుకుతుంది. ఆ గుమ్మపాలు నాకు తాగిస్తుంది. సంజ వేళ దీపం పుచ్చుకుని గొడ్ల చావడి చూసి, తిరిగివచ్చి

నా పక్కనే కూచుంటుంది. ఏడుగురన్నాదమ్ముల కథ చెబుతుంది....

తా త

ఎంత ముచ్చటగా ఉంది. బైరాగిని నాకూడా హుషారుపుడుతోందే! ఈ పెళ్ళిని గురించి మరేం మనసులో ఉంచుకోకు! నువు చేసుకోవాలనుంటే పాలమునిషి ఇంటో కోడళ్ళకే కావలసినంత మంది వున్నారు.

మా ధ వు డు

చాలిద్దురూ! ఇక్కడ నించో బుద్ధిపుట్టడం లేదు.

[వెళ్ళిపోతాడు]

అ మ ల్

ఫకీర్! మాంవయ్య వెళ్ళిపోయాడు. ఇపుడు చెప్పు. నాకు రాజుగారు రాసిన జాబు పోస్టాఫీసుకి వొచ్చిందా?

తా త

ఓ, ఆ జాబు బయల్దేరిందని విన్నాను. దోవలో ఉండి వుంటుంది.

అ మ ల్

దారిలోనా? ఏదారిలో? వానకురిసి వెలిశాక ఆకాశం నిర్మలంగా ఉన్నప్పుడు—దూరదూరంగా ఆ చెట్ల నడుమనించి అడివి చివరకంటా వున్న దారిలోనేనా?

తా త

నీ కంతా తెలుసన్నమాట! ఆ దారిలోనే!

అ మ ల్

ఫకీర్! నాకంతా తెలుసు!

తా త

నీ కెలా తెలుసో?

అ మ ల్

ఎప్పుడూ చూడలేదు. చాలసార్లు చూసినట్లుగా కళ్ళకట్టినట్టు ఉంది! చాలా కాలంక్రితం-ఎన్నాళ్ళో అయినట్లుంది. చెప్పలేను. ఇంకా తెలిసిందేమిటో చెప్పనా? రాజుగారి పోస్టు బంట్రోతు వొంటరిగా కొండమీంచి నడిచివస్తున్నాడు. ఎడం చేతిలో లాంతరు, వీపున ఉత్తరాలు సంచీను! అంతూ పొంతూ లేకుండా రాత్రింబగళ్లు నడిచివస్తున్నాడు. జలపాతాలన్నీ కలసి కొండ దిగువున ఏరై ప్రవహించడంలేదూ? ఆ ఏటిగట్టునే వస్తున్నాడు. పక్క జొన్నచేల మధ్యగా నడిచివస్తున్నాడు. తర్వాత చెరకుతోటలోకి వొచ్చాడు. కనిపించడంలేదు. బోదెలగుండా కాలిబాటనే నడిచి పెద్ద మైదానంలోకి వొచ్చాడు. వచ్చేస్తున్నాడు. మనిషన్నమాట లేదు. కీచురాయిమాత్రం

కీచుమంటోంది. పిట్టలు శోకలాడిస్తూ గెంతుతున్నాయి. దగ్గర దగ్గరగా పోస్టు బంట్రోతు వచ్చేకొద్దీ నా మనసు పొంగుతోంది.

తా త

నావి ముసలికళ్ళు. ఐతేనేం అదంతా నువు కళ్ళ క్కట్టినట్టు చేశావు.

అ మ ల్

ఫకీర్, పోస్టాఫీస్ రాజుగారిని నువ్వెరుగుదువా ?

తా త

బాగా ! రోజూ అక్కడికే వెళతాను భిక్షకి !

అ మ ల్

బలే. నయమయ్యాక నేనూ భిక్షకి వెళతాను. ఏం. వెళ్లకూడదా ?

తా త

నీకు అక్కర్లేదు బాబూ, రాజుగారే వచ్చి నీక్కా వలసిందంతా ఇస్తారు !

అ మ ల్

కాదు. నేనే వెళతాను. సింహద్వారంముందు నించుని 'జయం మహారాజా' అని జయం పలుకు తాను. కంజరీ వాయిస్తూ భిక్ష అడుగుతాను. బావుం టుందికదూ ?

తా త

చాల బావుంటుంది. నిన్ను తీసుకుపోయానంటే, నాకూ దండిగా దొరుకుతుంది. ఇంతకీ రాజుగారిని ఏమడుగుతావ్ నాయనా?

అ మ ల్

'పోస్టుబంట్రోతుపని ఇవ్వండి' లాంతరు పుచ్చుకుని మీ జాబులన్నీ ఇంటింటికీ పోయిఇచ్చివస్తాను. నన్ను మాత్రం రోజంతా ఇంటోపడేసి వుంచొద్దు' అనడుగుతాను.

తా త

ఇంటో వుండమంటే అంతకష్టం ఎందుకుబాబూ?

అ మ ల్

అబ్బే కష్టంలేదు. మొదట్లో ఇక్కడే బొద్దస్మానమూ పడివుండడం కష్టంగా వుండేది. రాజుగారి పోస్టాఫీసు వచ్చాక నాకు ఇక్కడే చాల బావుంది. ఓరోజున నాకూ ఓ జాబు వొస్తుంది. అది తలుచుకుంటూ ఒంటరిగా ఎంతకాలమైనా ఇలానే వుండిపోగలను. రాజుగారి జాబులో ఏముంటుందో నాకేం తెలీదుకదా, చిత్రం!

తా త

తెలీకపోతేనేం. నీపేరుంటుంది. అదేచాలు.

[మాధవుడు వొస్తాడు]

మీ ఇద్దరూ నాకు ఎసరుపెట్టాలని అనుకున్నారా ఏఁవిటి ?

తా త

ఏఁవిటసలు సంగతి ?

మా ధ వ

ఊరంతా వొకటే పుకారు ! మీ ఇద్దరికీ ఉత్తరాలు రాయడానికే రాజుగారు పోస్టాఫీసు పెట్టారని మీరు చెబుతున్నారటగా ?

తా త

సరే దానివల్ల ఏఁవయింది చెబుదూ !

మా ధ వ

ఇలాగని రాజుగారికో ఆకాశరామన్న ఉత్తరం రాశాడట మున్సబు.

తా త

అదేఁ. మన మాటలు ప్రతిదీ రాజుగారి చెవిని పడుతుందని తెలీదా ?

మా ధ వ

తెలిస్తే జాగర్తగా ఎందుకు మసులుకోరు? మధ్య ఆ రాజుగారి గొడవ తెస్తారెందుకు ? మీరు నా నెత్తిమీదకేదో తెచ్చేట్టున్నారు !

అ మ ల్

ఫకీర్ ! రాజుగారికి కోపంవొస్తుందా ?

తా త

కోపమా ! ఉత్తది. నీలాంటి కుర్రాడిమీదా, నా లాంటి ఫకీరుమీదా కోపం వొస్తుందా ? ఉఁహు ! ఎలావొస్తుందో నేను చూస్తాను !

అ మ ల్

ఫకీర్ ! పొద్దుటినించి నాకళ్ళు మసకలు కమ్ము తున్నాయి. ప్రతిదీ కలలాగాఉంది. హాయిగా వుండా లనిపిస్తుంది. మాటాడాలని లేదు. రాజుగారి జాబు రాదా ? ఒకవేళ ఈ గది హటాత్తుగా........

తా త

బాబూ ! రాజుగారి జాబు ఇవాళ తప్పకుండా వొస్తుంది,

[ధన్వంతరి వొస్తాడు]

ధ న్వ ం త రి

నీ కివాళ ఎలా వుంది ?

అ మ ల్

ఇవాళ బాధలన్నీ విరగడైపోయి ఎంతోహాయిగా ఉన్నట్టుంది, ధన్వంతరిగారూ !

ధన్వంతరి

[మాధవుడివేపు చూసి]

ఆ నవ్వు, ఉఁహూ, మంచిలక్షణంకాదు. 'హాయిగా వుండడం'-ఉహూ చాలా చెడ్డలక్షణం! చక్రధరుడు ఒకచోట ఏఁవన్నాడంటే—

మాధవ

ధన్వంతరిగారూ, చక్రధరుడి సంగతి దేవుడికి వొదిలెయ్యండి. ఎలావుందో ఏమిటో చెప్పండి, బాబూ.

ధన్వంతరి

ముందే చెప్పాను. ఐనా, అతడు కదలకుండా కూచున్నట్టు కనిపించదు. చూస్తే రోగం తిరగబెట్టి నట్టుంది.

మాధవ

కాదండీ. చాలా జాగర్తగా చూస్తున్నాను. గడప దాటనీయలేదు. ఆఖరికి కిటికీరెక్కలన్నీ మూసే శానండి,

ధన్వంతరి

ఇవాళ గాలి ఓ చిత్రంగా వుంది. కంగారుపడి మీ వాకిట్లోకి వొచ్చి చూశాను. ఆ గాలి మీ వాకిలి

తలుపుల్ని తోసేస్తోంది. ఆ గాలి మహా విషపుగాలి! తలుపులికి తాళం బిగించిరావడం చాల మంచిది. రెండు మూడు రోజులు ఎవళ్ళూ రాకుండా చెయ్య లేవూ? అంతగా రాక తప్పనివాళ్లు రావడానికి వెనక ద్వారం వుందిగా. ఆ కిటికీ తలుపులు మూసెయ్యడం చాల మంచిది. దాన్లోంచి సూర్య కిరణాలు రోగి మీదపడి మేల్కొల్పుతున్నాయి. అవి చాలా చెరుపు చేస్తాయి!

మాధవ

అమల్ కళ్లుమూసి పడున్నాడు. నిద్రపోతు న్నాడనుకొంటాను. ధన్వంతరిగారూ, అతడి మొహం చూస్తే....దారినపోయే కుర్రాణ్ణిపట్టుకొచ్చాను. ప్రాణం పొక ఎత్తుగా పెంచాను. ఇప్పుడు నేను దక్కించుకో లేకపోతే........

ధన్వంతరి

ఏఁవిటది? మున్నటు మీ ఇంటికి అలా అంగలు పంగలమీద వొస్తున్నాడు! ఏం గొడవొచ్చిందో! నేను పోతాను. తలుపులు కిటికీలు అన్నీ మూసెయ్య డం చాల మంచిది. ఇంటికివెళ్ళి మంచి మందు పంపు తాను. ఆఖరకదే బ్రతికించాలి, నూకలంటూ వుంటే!—

[ధన్వంతరి మాధవుడు వెళిపోతారు. మున్సబువొస్తాడు]

మున్సబు

ఏఁరా డింభకా!

తాత

[తొందరగా లేచి]

ష్. నెమ్మది.

అమల్

నిద్రపోయాననుకున్నావా ఫకీరు? ఉఁహూ! అన్నీ విన్నాను. ఎక్కడెక్కడి మాటలో నాకు వినిపిస్తు న్నాయి. మా అమ్మ నాన్న నా తలదగ్గిర కూచుని కబుర్లు చెబుతున్నట్టుంది!

[మాధవుడు వొస్తాడు]

మున్సబు

మాధవా! నీకు పెద్దపెద్దవాళ్లతోనే కాలక్షేపం అవుతోందని విన్నానే!

మాధవ

పేదసాదలం, మున్సబుగారూ, మమ్మల్ని ఎగతాళి పట్టించారే!

మున్సబు

మీవాడు రాజుగారి జాబుకోసం కాచుక్కూచు న్నాడట!

మా ధ వ

నోరూవాయిలేని ఆ పిల్లవాడి మాటల్ని లెఖ్ఖ చెయ్యకండి.

ము న్స బు

అదేఁవిటిలే! ఇంత గొప్ప కుటుంబంతో రాజుగారికి కత్తు కలిసిందామె! కిటికీ తిన్నగా రాజుగారు కొత్తగా పోస్టాఫీసు ఎందుకు పెట్టించారనుకున్నావ్? కుఱ్రాడా! రాజుగారిదగ్గరనించి నీ కో జాబు వొచ్చిందిరా!

అ మ ల్

[లేవబోతూ]

నిజంగానాండీ?

ము న్స బు

అబద్ధం ఎలా అవుతుంది మరి! నువ్వేమో రాజుగారికి ప్రాణమిత్రుడవయ్యె! ఇదిగో నీ జాబు. (ఉత్త తెల్లకాగితంముక్క చూపిస్తూ) హె! హె! హె! ఇదేరా నీ జాబు!

అ మ ల్

ఎద్దేవ చేయకండీ! ఫకీరు ఇది నిజమేనా? చెప్పవూ?

తా త

అవునుబాబూ ! ఫకీరుని చెపుతున్నాను. ఇది రాజు గారి జాబే !

అ మ ల్

నాకేం కనిపించడంలేదే ! నాకంతా తెల్లగా ఖాళీ గానే కనిపిస్తోంది. మున్సబుగారూ ! ఆ జాబులో ఏం రాసి వుందండీ ?

ము న్స బు

రాజుగారు ఏం రాశారంటే—'రేపు మాపట్లో నీ దగ్గరకొస్తున్నాను. నాకోసం మంచి మరమరాలు తయారుచేసివుంచు. ఈ కోటలో వుండాలని నాకే మాత్రమూ లేదు !—' హె ! హె, హె !

మా ధ వ

[చేతులుజోడించి]

మున్సబుగారూ, దండంపెడతాను. ఇలాంటి ఎగ తాళిమాత్రం చెయ్యకండిబాబూ !

తా త

ఎగతాళా ? హు ! అంత ఇదా ఈయనకి ?

మా ధ వ

నీకు మతీగితీ పోలేదుకదా తాతా !

తా త

పోయింది మతి, అందుకే బావున్నాను. రాజుగారి జాబు చక్కా చదివేను. 'అమల్‌ని చూడ్డానికి వస్తానని, వచ్చేటప్పుడు రాజవైద్యుణ్ణి తనతో తీసుకొస్తానని' రాజుగారు ఇందులో రాశారు!

అ మ ల్

ఫకీర్! ఫకీర్, ష్. అదుగో రాజుగారి కోటలో భేరీ మోగుతోంది! వినిపించడంలేదూ?

ము న్స బు

ఒహోహో! ఇంకాస్త బుర్ర చెడితేగాని వినిపించదని నా అనుమానం.

అ మ ల్

మున్సబుగారూ! నేనంటే మీకు ఇష్టంలేదనీ, కోపంఅనీ అనుకున్నాను. మీరు రాజుగారి జాబు తెస్తారని నేనేమాత్రం అనుకోలేకపోయానుసుమండీ! కాస్త మీ కాళ్ళను పట్టుకోనివ్వండి.

ము న్స బు

కుర్రాడికి కొంచెం భయభక్తులున్నాయి. ఎటొచ్చీ కాస్త మతి తక్కువ! మనసు మంచిదేమరి!

అ మ ల్

పొద్దుకూకినట్టుంది. గంట టంగ్ టంగ్ టింగ్ - టంగ్ టంగ్ టింగ్' - అని కొడుతోంది. సంజ చుక్కలు పొడిచాయా! నాకేం కనిపించడంలేదేం?

తా త

ఓ....కిటికీలన్నీ మూసేశారు, నేను తెరుస్తానులే.

[బయట పెద్దచప్పుడు]

మా ధ వ

ఏవిటది? ఎవరు వాళ్ళు? మళ్ళేం బెడద వొచ్చిందో?

గొం తు

(బయటనించి]

తలుపు తెరువు!

మా ధ వ

మున్సబ్‌గారూ - వాళ్ళు దొంగలో, తోడు మోతులో అంటుఉంటారండీ.

ము న్స బు

ఎవరక్కడ? నే నెవర్ననుకున్నార్రా, నా పేరు పంచానన, మున్సబుని. ఎవరా పిల్చేది? గొడవ చెయ్యడానికి గుండా? చెరువా? అదీ, చూశారా గొడవా గిడవా ఆగిపోయింది! పంచానన పేరు చెబితే-ఏడీ దొంగా గింగా....ఎక్కడో చూపించుమరి!

మా ధ వ

[కిటికీలోంచి తొంగిచూసి]

బయట తలుపు విరగ్గొట్టేశారు బాబూ! అందుకే మరి గొడవలేకుండా పోయింది.

[రాజుగారి చోపుదారు వొస్తాడు]

చో పు దా రు

మహారాజులుంగారు ఇవ్వాళ రాత్రికి దయచేస్తున్నారు.

ము స్ల బ్బు

ఆరిభగవంతుడా!

అ మ ల్

ఈ రాత్రి ఎన్నిగంటలకు వొస్తారు?

చో పు దా రు

నడిరాత్రివేళ వొస్తారు.

అ మ ల్

నా స్నేహితుడు చౌకీదారు పట్టద్వారంవద్ద టంగ్ టంగ్ టింగ్-టంగ్ టంగ్ టింగ్, అని గంటలు కొడతాడే, అప్పుడేనా?

చో పు దా రు

అవును, అప్పుడే! మహారాజులుంగారు తమ చిన్న స్నేహితుడివని, నిన్ను చూడ్డానికి రాజవైద్యుణ్ణి పంపించారు.

[రాజవైద్యుడు వస్తాడు]

రాజ వైద్యుడు

ఏఁవిటిది? అన్నీ మూసేశారేఁ? తలుపులు, కిటికీలు బాగా తెరిచేయండి! (అమల్ వొళ్లు పరిశీలించి) బాబూ, నీకెలావుంది?

అ మ ల్

నాకు బావుంది. చాల బావుందండీ! నెప్పులన్నీ పోయాయి. అన్నీ తెరిచేశారు! చీకటికి అవతలి వేపున ఉన్నట్టుగా నక్షత్రాల మిలమిలలు నా క్కనిపిస్తున్నాయి.

రాజవైద్యుడు

ఇవాళ నడిరాత్రి వేళ రాజుగారు వచ్చినప్పుడు— నీవు పక్కమీంచి లేచి బయటికి రాగలవా?

అ మ ల్

ఆఁ. బయటికి వచ్చానంటే బ్రతికిపోతాను. ధ్రువ నక్షత్రం చూపించమని రాజుగారిని అడుగుతాను. ఎన్నిసార్లో చూశాను కాని ఏది ధ్రువనక్షత్రమో చెప్పలేను!

రాజవైద్యుడు

రాజుగారే అన్నీ నీకు చెబుతారు. (మాధవుడితో) రాజుగారు వచ్చేసరికి ఇక్కడ పువ్వుల్తో అలంకరించి

వుంచు ! (ముస్సబ్‌ని ఉద్దేశించి) ఇతన్ని ఇక్కడ ఉండడానికి వీల్లేదు !

అ మ ల్

ఉంచనివ్వండి. ఆయన నా స్నేహితులు. రాజుగారి జాబు తెచ్చి ఇచ్చిందాయనే !

రాజవైద్యుడు

సరే నాయనా, నీ స్నేహితుడంటున్నావుగా, అలాగైతే వుండొచ్చు !

మా ధ వ

[అమల్ చెవిలో]

చిట్టిబాబూ ! రాజుగారికి నువ్వంటే ఎంతో ప్రేమ ! ఆయనే స్వయంగా వొస్తున్నారు. ఆయన్ని ఏదన్నా పెద్ద సహాయం చెయ్యమని కోరుకో ! మన పరిస్థితి అంతా నీకు తెలుసుగా !

అ మ ల్

నువు ఇదవకు మావయ్యా ! ఇదివరకే నేనంతా తయారుచేసుకున్నాను.

మా ధ వ

ఏం తయారుచేశావుబాబూ.

అ మ ల్

రాజుగారి పోస్టాఫీసులో బంట్రోతు ఉద్యోగం ఇవ్వమని అడుగుతాను. ఆయన జాబుల్ని సందేశాల్నీ ఊరూరూ దేశదేశాలన్నీ తిరిగి ఇంటింటికీ పంచుతాను.

మా ధ వ

[నుదురు కొట్టుకుంటూ]

ఇంతే కర్మ !

అ మ ల్

మాఁవయ్యా ! రాజుగారు వచ్చేసరికి ఏవేఁవి సిద్ధంచేస్తున్నావ్ ?

చో పు దా రు

మరమరాలు చాలని రాజుగారు చెప్పారు.

అ మ ల్

మరమరాలా ! మున్సబుగారూ మీరు చెప్పిందే నిజం ! మీరు అన్నీ ముందే చెప్పేశారు. మీకు అన్నీ తెలుసు ! నాకే తెలీదు.

ము న్స బు

మా ఇంటికి కాకితో కబురంపిస్తే చాలు, రాజుగారికి తగినన్ని............

రాజవైద్యుడు

ఏఁవక్కర్లేదు! నువు మెదలకుండా వుండు. అతడికి నిద్ర ముంచుకొస్తోంది! అతని తలవద్ద కూచుంటాను. నిద్రపోతున్నాడు. ఈ నూనెదీపాలు తీసెయ్యండి. నక్షత్రాలకాంతిని లోపలకి రానివ్వండి. హుష్! నిద్రపోతున్నాడు.

మాధవ

[తాతతో]

రాతిబొమ్మలా ఉలుకూ పలుకూ లేకుండా అలా చేతులు కట్టుకునుంచున్నావేఁ తాతా! నాకేఁవిటో ఇదిగావుంది! ఇవన్నీ మంచిలక్షణాలేనా? చెప్పవూ? గదంతా చీకటిచేస్తున్నారెందుకు? నక్షత్రాల కాంతి వల్ల వచ్చేదేఁవిటి?

తాత

నువు ఉత్త అపనమ్మకస్తుడివి! మాటాడకుండా వూరుకో!

[సుధవొచ్చింది]

సుధ

అమల్.

రాజవైద్యుడు

నిద్రపోతున్నాడమ్మా.

సు ధ

అతడికోసం పువ్వులు తెచ్చాను. నాచేత్తో ఇవ్వడానికి వీల్లేదా ?

రాజవైద్యుడు

ఇవ్వొచ్చు !

సు ధ

అమల్ ఎప్పుడు మేల్కొంటాడు ?

రాజవైద్యుడు

రాజుగారు వచ్చి అతన్ని పిలుస్తారు....అప్పుడు....

సు ధ

అతని చెవిలో ఓ మాట చెబుతారూ ?

రాజవైద్యుడు

ఏంచెప్పమంటా వమ్మా ?

సు ధ

సుధ నిన్నెప్పుడూ మరిచిపోదని-చెప్పండి.

[తెర]

ఇంటలో—

తాత

చలం

—తతిమ్మావన్నీ ఊహాపాత్రలు.

# వీథిదీపం

## 1

[లింగన్నపాలెంలో మారుమూల సందు మొగిని దీపస్తంభం.

చలం స్తంభానికి ఆనుకొని నించున్నాడు. పేదవిద్యార్థి, చేతిలో పుస్తకంవుంది. దీపంవేపూ, బజారువేపూ తరుచు చూస్తున్నాడు. ఒకోసారి ముందుకు నాలుగడుగులేసి, ఎవరికోసమో ఎదురుచూసి వొస్తున్నాడు.

కనుచీకటి పాకుతోంది.

ఒక బజారుకుక్క స్తంభానికి చేరువగా తిరుగుతోంది. ఎవరెవరో వస్తూపోతున్నారు.]

చలం

దీపాలు వెలిగించే రామన్నతాత ఇంకా రానేలేదు. మీ కెవరికైనా కనిపించాడా ?

ఒకరు

(ఎగతాళిగా) ఉయ్యాలెక్కి సోదడిగిరా !

చలం

అంత ఎగతాళి ఎందుకులెండీ ? రోజూ ఈపాటి కల్లా వొచ్చేవాడు. ఎంచేతనో ఇవాళ రాలేదు.

ఒ క రు

ఆ ముసలోడు రాకపోతేనేం ? నువ్వు తయార య్యావుగా ! తెల్లార్లూ ఆ దీపంకాడ పాతుకుపోతావ్! శుభ్రంగా ఇంటో చదువుకోరాదూ ? నువు చదివే చదువుకి దీపాలు తక్కువయ్యా బజారు దీపాలకాడ చేరావ్ ?

చ లం

నాకూ మీలాగా ఇళ్ళూ వాకిళ్లూ ఉంటే అలాగే చదువుకునేవాణ్ణి. వారాలు చేసుకుని, రాత్రిళ్ళు ఈ దీపాల వద్ద చదువుకుంటున్నానుబాబూ ! నావంటి పేద వాడికి ఇళ్ళూ వాకిళ్ళూ ఎక్కడున్నాయి ?

ఒ క డు

(వికటంగా నవ్వి, వెక్కిరించినట్టుగా) ఇల్లూ వాకిలీలేని పరమ దరిద్రుడికి చదువెందుకయ్యా ? ఉన్నోడు చదివీ, లేనోడు చదివీ ఏం బావుకుందా మనీ ? ఊళ్ళేలదామనా ? ఏం బొడిచేద్దామనో నీ చదువు ?

చ లం

చదువు వొకరి సొమ్ముకాదుకదండీ ? ఓపికుంటే మీరూ చదవండి. నేనేం కాదనలేదు. ఎదటివాళ్లని

ఆడిపోసుకుంటే మీకు వొచ్చే లాభం ఏముంది? తనకు లేదని ఏడిస్తే ఒక కన్ను పోయిందట! ఎదటి వాడికి ఉందని ఏడిస్తే రెండుకళ్లూ పోయాయట! మీకూ తెలుసుగా ఆ సామెత!

ఒ క రు

కూటికిలేని లిల్లాయిగాళ్ళు చదువు మొదలెడితే ఇలాటి కారుకూతలె వొస్తవి. మంచీ మర్యాదా ఏం తెలుస్తుంది.

చ లం

మీకు తెలిసిన మర్యాద నాకు తెలియనిమాట నిజమే!

ఒ క రు

హూ! పితపకాలం! నీలాంటి కుర్రకుంకలతో మాటాడ్డం మా పరువుకే నష్టం.

[అని వెళ్లిపోతారు. రామన్నతాత బుజాన నిచ్చెన తగిలించుకుని వొస్తాడు. ఎదురుగా వెళ్లి చలం-తాత చేతిని పట్టుకుంటాడు.]

తా త

ఎవరు నాయనా?

చ లం

నేనే తాతా! చలాన్ని. ఇంత ఆలస్యమయిందేం తాతా?

తా త

ఆలస్యమయింది నాయనా !....అయిపోయింది.

[ఇద్దరూ స్తంభందగ్గరకు వొచ్చారు. తాత నిచ్చెన స్తంభానికి ఆనిస్తాడు.]

చ లం

తాతా ! నీకో మంచి కబురు చెప్పాలని వొచ్చాను. కాని-

తా త

కాని-చెప్పు నాయనా, వింటాను.

చ లం

నువ్వలా దిగులుగా కనిపిస్తే ఎలా చెప్పను ? ఎంత మంచి కబురనుకున్నావ్ తాతా !

తా త

ఏంలేదు నాయనా ! అంత మంచి కబురయితే వినకుండా ఎలా ఉండను ? చెప్పు బాబూ చెప్పు !

చ లం

[తనలో తాను అనుకున్నట్టుగా చెప్పుకుపోతూంటాడు]

ఆరేళ్ళనించీ రాత్రింబగళ్లూ కష్టబడి చదివాను. తిన్నా, తినకపోయినా చదివాను. కనిపెంచినవాళ్లెవరో తెలీదు. తోడునీడా లేదు. చేతిలో పైసా లేదు. వేళ కింత ప్రసాదం దొరికితే తిన్నాను. వేళకి నువ్వు దీపం వెలిగించితే ఈ దీపంకింద చదువుకున్నాను.

ఆరేశ్ను ! తాతా ! నువ్వూ, ఈ దీపం ఉండబట్టే పరీక్షల కెల్లాను.(పెద్దగా)నేను పరీక్షల్లో ప్యాసయ్యా నని ఇవాళే తెలిసింది తాతా ! తాతా ! ప్యాసయ్యాను.

తా త

(చలాన్ని కౌగిలించుకుని అర్ధ్రస్వరంతో) ఎంత మంచి తండ్రివయ్యా నువ్వు ! దీపాలు వెలిగించడం నా ఉద్యోగం నాయనా ! అంతకన్నా మించి నేను నీకు ఏం సాయం చేయకలిగాను. ఒక పూటన్నా పిడికెడు మెతుకులు పెట్టగలిగానా ?....నాకుంటేనా నీకు పెట్ట డానికి !

చ ల ం

తాతా! అన్నంపెట్టాలా? రోజూ నన్ను ప్రేమతో పలకరించడం చాలదా తాతా ? చల్లని మాటకన్నా మించిందేముంది ?....నేను రేపే పట్నం వెళుతున్నాను తాతా ! నేను బాగా చదివినందుకు ప్రభుత్వమే నన్ను పట్నం పంపించి చదివిస్తోంది.

తా త

(గతుక్కుమన్నట్టు అయి, నిబ్బరంగా) రేపే వెళిపోతున్నావా ? నీకూ నాకూ రేపే !!....చక్కగా చదివి, పెద్దవాడివై తిరిగిరానాయనా ! నేను బ్రతికి ఉంటే—

చ ల ం

అదేంమాట తాతా! నీవు కలకాలం బ్రతుకుతావు. నేను పట్నంనించి వొచ్చి నిన్ను చూస్తాను తాతా!.... నీకూ నాకూ రేపే అంటావేఁమిటి తాతా?

తా త

అవును. ఇవాళతో నా కీ కొలువు సరి!....ముందు దీపం వెలిగించి వొస్తాను. తర్వాత చెబుతాను....

[తాత నిచ్చెనమీదుగా వెళ్లి దీపం వెలిగించుతాడు. చలం తాత వేపు చూస్తూంటాడు.]

చ ల ం

తాతా! నువ్వనేది నాకేం తెలీలేదు.

తా త

(దిగివొచ్చి చలం బుజాన్ని తట్టి) ఇరవైయేళ్ళ నించీ ఈ దీపాల్ని వెలిగిస్తున్నాను. నేను ముసలి వాణ్ణయిపోయానని ఇవాళతో నా ఉద్యోగం తీసేశారు. రేపటినించి ఈ దీపాల దగ్గరకు రాను నువ్వూరావు.

చ ల ం

ఇదేఁవిటి తాతా! ఇవాళ నేను ప్యాసవడం, నీకు ఉద్యోగం పోవడం!....ఇలా జరిగిందేఁ తాతా?

తా త

దేనికదే నాయనా! నిజంగా ముసలివాణ్ణేకదా! కాని, ఒకందుకే నాకు దిగులు!

చ లం

ఏఁవిటో చెప్పవూ తాతా!

తా త

ఏంలేదు నాయనా, మామూలు విషయమే! ఈ దీపాలతో ఇరవైఏళ్లుగా నాకు స్నేహం. ఈ ఇరవై ఏళ్ళల్లో నా జీవితంలో ఎన్నోమార్పులువచ్చాయి. భార్య చనిపోయింది. పిల్లలు తలోదోవా వెళ్ళిపోయారు. ఊరుమారింది. కాలం మారింది. ప్రభుత్వం మారింది. అన్నీ మారాయి. నేనూ, ఈ దీపాలూ మాత్రం మారలేదు. నాలాగే ఈ దీపాలూ ముసిలివై పోయాయి.

చ లం

తాతా! ఇవాళ నీ వేదో అదోలా మాటాడు తున్నావు.

తా త

అవును. అఖరిరోజు కనక. ఇరవైఏళ్ళ స్నేహం వల్ల ఈ దీపాలు నాకు పిల్లల్లాగా కన్పిస్తవి. వెల గించడం కాస్త ఆలస్యమయితే దిగులుపడతాయి.

నేను దీపం వెలిగిస్తూంటే-ఎంతచక్కగా నవ్వుతాయో నువ్వు వినలేదు. ఎవరూ వినిఉండరుకూడా. పసి పాపలలాగా నవ్వుతాయి. ఆడతాయి. ఎంత చక్కగా ఉంటాయి !

చ ల ం

దీపాలు నవ్వుతాయా ! నిజం ??

తా త

అబద్ధం ఏముంది ? వాటి నవ్వులూ, దిగుళ్ళూ నాకే తెలుస్తాయి....సరే. నాయనా ! వెళ్తొస్తాను. ఇంకా వెలిగించవలసిన దీపాలు చాలాఉన్నాయి. నువు తిరిగివచ్చేనాటికి బ్రతికిఉంటే-నిన్ను చూస్తాను.

[తాత బుజాన నిచ్చెన తగిలించుకుని బయల్దేరాడు. చలంకూడా తాతవెంట నడిచి]

చ ల ం

తాతా నువు చెప్పింది అర్థమయింది. నేను తప్ప కుండా ! పట్నం నించి వస్తాను. నిన్ను చూస్తాను.

తా త

మంచిది నాయనా ! వెళ్తొస్తాను.

[తాత వెళ్ళిపోతాడు. చలం తిరిగి దీపంవద్దకు వొచ్చి, పుస్తకం తెరిచి చదువుతుంటాడు.]

చ ల ం

(చదువుతూ) కారుచీకటికి కాంతిరేఖలనిచ్చే ఈ దీపాల చరిత్ర అత్యద్భుతమైనది. మానవుడు స్వయం

కృషితో ప్రకృతిని జయించాడనడానికి 'దీపాలచరిత్ర' సాక్ష్యం. కొరకంచులతో ప్రారంభమైన ఈ చరిత్ర ఎలెక్ట్రిసిటీ వరకు సాగింది. ఇంకా సాగుతుంది. (చలం పుస్తకం మూసేసి, దీపంవేపు చూసి, తాత వెళిపోయిన దారివేపు చూసి-) అవును. దీపాల చరిత్ర అద్భుతమైనదే! తాత చెప్పింది నిజమే! దీపాలు నవ్వుతాయి ఆడతాయికూడా!

## 2

[అదేచోట - చదువుకుని, చలం వెళ్లిపోయాడు. తర్వాత దీపం మసక మసకగామారి మనిషిగా మారుతుంది; కుమిలి కుమిలి ఏడుస్తుంది.]

దీపం

ఎవరితో ఏమని చెప్పుకోను! ఇవాళతో నా బ్రతుకు ఆఖరేనా? గాలివాస్తె జడిశాను. వానవాస్తే తడిశాను. జడవకుండా, తడవకుండా భద్రంగా ఆతాత కాపాడాడు. ఆ తాత ఇకరాడా? నేను ఒంటరిగా దిగులుపడకుండా, ఆ విద్యార్థితోడుగా ఉండేవాడు! రేపటినించి ఎవరూ రాకపోతే నేనేంకాను? అయ్యో!(ఏడుస్తుంది) దేశదేశాలు చూడడానికి గాలినైనా కాను. ఆకాశంలో తిరగడానికి మబ్బుకన్నెనైనాకాను. అందంగా వెలగ

డానికి నక్షత్రాన్ని కాను. నేను దీపాన్ని. వీథిలాంతరుని. నాకెవరూ స్నేహితులు లేరా? ఇవేళతో నా బ్రతుకు ఆఖరేనా? [ఏడుస్తుంది.]

[పెద్దగాలి వీస్తుంది. దీపం కళ్లు మూసుకుంటుంది.]

గా లి

ఎందుకే దీపమా, ఎందుకే ఏడుస్తున్నావు?
మిత్రుణ్ణి గాలిని. చెప్పవే దీపమా!

దీ ప ం

రావోయి మిత్రమా! రా! ఏంచెప్పను?

గా లి

చెప్పవే! జరిగింది చెప్పవే దీపమా!

దీ ప ం

నన్ను వెలిగించి, ఆడించే తాత రేపటినించీ రాడింక. ఇప్పుడే విన్నాను. ఇవాళతో నా జీవితం....

గా లి

అయ్యో! దీపమా! ఎంత చెడువార్త! ఎవరు చెప్పారే నీకు?

దీ ప ం

నా వెలుగునీడ చదివే చలానికి తాత చెబుతూంటే విన్నాను మిత్రమా!

గా లి

అలాగా! తాత రాకపోయినా, చలం వస్తాడు కదే! దిగులెందుకే దీపమా

దీ ప ం

లేదు మిత్రమా! అతనూ పట్నం వెళ్ళిపోతున్నాడు రేపే. నా కెలాగ? ఏం చెయ్యను?

గా లి

అయ్యో! ముత్యాలదీపమా! మిత్రమా! నాకు విచారంగానే ఉంది. నీకు తోడుగా ఉందామంటే కాలు నిలిపి ఉండలేనయ్యో!

దీ ప ం

ఆ చల్లని మాటే చాలు! అదే పదివేలు!

గా లి

నీ కొక్క వీడ్కోలు వరమిస్తాను దీపమా! గాలికైనా పెనుతుఫానుకైనా చెక్కుచెదరని బల మిస్తున్నానోయి మిత్రమా! నావల్ల కాదగిన దింతే! వీడ్కోలు మిత్రమా! సెలవు.

దీ ప ం

పోయిరా మిత్రమా! వరమిచ్చి బలమిచ్చి కాపాడినావు. నను మరిచిపోకు. సెలవు.

[దీపం తేజోవంతమవుతుంది.]

ఇంతలో ఎంతమార్పు! కొత్తనెత్తురు వొచ్చి నట్టుంది! కాని....ఏం లాభం?

[ఉరుములు మెరుములువిసిరి మబ్బుకన్నె వస్తుంది]

మ బ్బు క న్నె

విన్నాను దీపమా, విన్నాను నీ గాథ.

దీ ప ం

విన్నావి మబ్బుకన్నెవా! రామ్మా, రా!

మ బ్బు క న్నె

గాలి చెప్పగా విన్నాను. నీ కష్టాలు విని కన్నీరు పెట్టాను. నిను చూడ వచ్చాను. వీడ్కోలు ఇస్తాను. లేచింది మొదలు దేశదేశాలు తిరగాలి. నీకు తోడై ఉండలేను. ఇటు సముద్రుడి వద్దకు పోవాలి. అటు కొండలవేపు వెళ్ళాలి. వాననై, జడివాననై కురవాలి. ఏం చేయగలనోయి సాయము! ఏమిప్వమంటావు, చెప్పు మిత్రమా!

దీ ప ం

నీ చల్లని దయవుంటె చాలు! అదే పదివేలు నాకు! మబ్బుకన్నెవు. నన్ను మరవకుండా చూడు...

మ బ్బు క న్నె

నీ కొక్క వీడ్కోలు వరమిస్తాను మిత్రమా! వానకైనా, జడివానకైనా తడిసిపోని శక్తి నిస్తున్నాను.

తడిసినా ఆరిపోని వెలుగు నిస్తావు. వెళతాను మిత్రమా ! నా చివరి వీడ్కోలు ! సెలవు !

దీ ప ం

వెళ్ళిరా, నను మరచిపోకు. వరమిచ్చి బలమిచ్చి తోడునీడయ్యావు. సెలవు.

[దీపం శక్తివంతమవుతుంది]

ఎంతచిత్రం ! వానకైనా వరదకైనా లొంగనిక ! ....కాని....ఏంలాభం !

[మెరుస్తున్న నక్షత్రాలగుంపు వస్తుంది]

న క్ష త్రా లు

బంగారు దీపమా ! వచ్చాము, వచ్చాము.

దీ ప ం

కళ్లు చెదిరేలాగు వెలుగుతున్నారు. మీరెవరో గుర్తు రావడంలేదు....

న క్ష త్రా లు

ఇంతలోనే మరుపా ? దీపమా ! గాలిమిత్రుడు నీకబురు చెప్పాడు. మబ్బుకన్నె నీ దిగులు చెప్పింది. విని మేము విలపించాం.

దీ ప ం

చిన్ని ముత్యాల్లారా! చిట్టి కుక్కల్లారా ! గుర్తించనందుకు నన్ను మన్నించిరండి....

న క్ష త్రా లు

ఆకాశమే మా ఇల్లు. ఆ లోకమే మా సీమ. భువి మీద నీతోడ నిలవగా మాకు అవకాశమేదీ ? గోళాల నన్నింట వెలుగుతూ తిరగాలి. పగలు సూర్యుణ్ణి, రేయి చంద్రుణ్ణి కొలవాలి. కొలువువిడిచిపోవ నను మతి లేదయ్యె. దీపమా ! వీడ్కోలు చెప్పగా వచ్చాము. గాలి ఇచ్చిన బలము, మబ్బుకన్నె ఇచ్చిన శక్తి నిన్ను కాపాడతయ్. ఇంక నీకేమి కావాలి ? చెప్పు మిత్రమా !

దీ ప ం

మీ కరుణ ఉంటె అదేచాలు పదివేలు నాకు ! ఇలాగే....నా బ్రతుకు !

న క్ష త్రా లు

అలాకాదు మిత్రమా ! నీకొక్క వరమిచ్చి వెళ తాము. మసక మసక వెలుగు నీకు అందమా ? చందమా ? మాకున్న శక్తితో నీకు వరమిస్తాము, ఇకముందు చందమామలాగ తెల్లగా, చల్లగా, వెలుగుతావు. నూనె, వొత్తీ అక్కరలేదు. దివ్యంగా మెరుపులాగా వెలుగుతావు....వెళతాము....మిత్రమా ! వీడ్కోలు....సెలవు....

దీపం

మీ చల్లని దయకు నా వందనాలు! నను మరువక తలవండి! వెళ్ళిరండి! సెలవు!

(నక్షత్రాలు వెళిపోగా, తళుక్కుమని మెరుస్తూ విద్యుల్లత వొస్తుంది.]

ఎవరవో, తళుకు తళుకుమని మెరిసే మిత్రమా ఎవరవో?

విద్యుల్లత

నేను నీ ఆత్మీయురాలనే....(మాయమవుతుంది)

దీపం

కనుమరగిపోయావు, ఎక్కడున్నావు మిత్రమా?

[కనిపించకుండానే విద్యుల్లత]

తాళు మిదుగో, వొస్తున్నా! (కనిపిస్తుంది) విద్యుల్లతను. తెలిసిందికదా! (మాయమవుతుంది)

దీపం

తెలిసింది మిత్రమా! క్షణ క్షణం నూత్నకాంతి నీ సొమ్ము. పిలుస్తున్నాను రా!

విద్యుల్లత

నీ పిలుపు విన్నాను. నీదే గెలుపు. నేను నీలో ఆవేశిస్తున్నాను దీపమా! నేనే నీవుగా, నీవే నేనుగా కలకాల మీ భువిని నిలిచి జీవించుదాం!

దీ ప ం

అలాగే విద్యుల్లతా! నీ కౌగిళ్లలో విద్యుద్దీపాన్ని అవుతాను వేలేల్లు వెలుగుతాను. నీవలెనే కోటికోటి దీపాల వెలుగునై జీవించుతాను.

(విద్యుల్లత రటాలున మెరిసి దీపంలో ఐక్యమవుతుంది)

దీ ప ం

ఓహో! వొళ్ళు పులకరిస్తోంది. మెరుస్తోంది.

(దీపం విద్యుద్దీపం అవుతుంది)

ఇంతలో-ఎంత మార్పు! వీథీలాంతరునల్లా విద్యుద్దీపాన్ని అయ్యాను. ఇంటా బయటా జీవం ఉన్న ప్రతిచోటా వెలుగుతాను. నా వెలుగుతో ప్రాణు లకు జీవమిస్తాను. పొలాలకు పంటనిస్తాను. గాలిని నిర్మిస్తాను. ఆనందం ఐశ్వర్యం అందరికీ అందిస్తాను.

[ బృం ద గా న ము ]

# 3

[అదేచోట. దీపస్తంభం ఉన్నచోట ఎలక్ట్రిక్ లైట్ వెలుగుతోంది. పక్కనే పాక. పాకలో కుర్చీ, ముందో మేజా, మేజామీద చక్కని దీపం. కుర్చీమీద తాత కూచున్నాడు. పరిశుభ్రంగా, ఆరోగ్యంగా ఉన్నాడు. పత్రిక చదువుకుంటున్నాడు. దూరాన 'ఫైర్మన్ చలంగారికీ జయ్' అని నినాదాలు వినిపిస్తాయ్. తాత ఎంతో ఉల్లాసంగా కనిపిస్తున్నాడు. చలం గుర్తుపట్టలేని వేషంలో వస్తాడు. తాత లేచి నిలబడతాడు.]

తా త

ఎవరండీ ? ఇలా దయచేయండి.

చ లం

మీరు కూర్చోండి. నే నిటు కూర్చుంటాను.

తా త

ఎవరో గుర్తుపట్టలేకపోయాను.

చ లం

ఎలావుంది తాతగారూ, మీ ఆరోగ్యం ? జీవితం కులాసాగా నడుస్తోందా ?

తా త

ఆ ! చాలా ఆనందంగావుంది నాయనా ! ఎన్ని మార్పులు ! పదేళ్ళక్రితం వీథిలాంతర్లు వెలిగించే వాణ్ణి. అతి పేదరికంవల్ల బాధపడ్డాను. ఇలాంటి

సుఖజీవితం వస్తుందని నేను కలలోకూడా అనుకో లేదు నాయనా! ఆ వీథి దీపాల మసక వెల్తురులో ఊళ్ళూ మనుషులూ అంతా క్రీనీడల్లాగా కనిపించే వారు! ఇప్పుడో....అంతా పట్టపగలు! ఎక్కడ చూసినా వెల్తురే! ఎలాంటి వెల్తురు! గాలికి ఆరదు వానకు తడవదు. నక్షత్రాలకాంతిలాగా వెల్తురు! ఎంత అద్భుతం! రాత్రిళ్లుకూడా పేపరు చదవగలుగు తున్నాను. హాయిగా ఆనందంగా ఉన్నాను. దీని కంతటికీ మూలకారణం మా చెయిర్మన్‌గారంట! ఆయన ఎవరో ఏమో నాకు తెలీదు.

చలం

ఆయనెవరైతేనేం తాతా!

తాత

అలాకాదు నాయనా, అంత చీకటి పోగొట్టి ఇంత వెల్తురుని ఇచ్చిన ఆయన్ని ఒకసారి చూడాలని ఎంతోఇదిగా ఉంది!

చలం

ఎందుకంత ఇది నీకు తాతా?

తాత

ఏం లేదు నాయనా! ఈ చెయిర్మన్‌గారి పేరూ చలం! వెనక నాకో స్నేహితుడుండేవాడు.

చ లం

ఎవరతను తాతా !

తా త

అతని పేరూ చలం ! ఇక్కడే ఒక వీథిలాంతరు ఉండేది. అది వెలగించడానికి నేనూ, చదువుకోడానికి అతనూ వొచ్చి కలుసుకునేవాళ్ళం. ఆఖరికి అతను పట్నం వెళ్ళిపోయాడు. అదేరోజున నేనూ ఉద్యోగం చాలించుకున్నాను. పట్నంనించి వొస్తానని చెప్పాడు. ఎంతో మంచివాడు. మన చెయిర్మన్‌గారి పేరు విన్నప్పుడల్లా అతను జ్ఞాపకం వొస్తాడు.

చ లం

ఆ చలమే ఈ చైర్మన్‌గారేమో !

తా త

అలా అయితే ఆయన నను మరిచిపోతారా ?

చ లం

మరచిపోలేదు తాతా ! నేనే తాతా ! నన్నింకా గుర్తుపట్టలేదా !

[తాత దగ్గరికి వొచ్చి కౌగిలించుకుంటాడు]

తా త

(అర్ధస్వరంతో) నాయనా ! వెయ్యేళ్ళు జీవించు తండ్రీ ! నువ్వేనా నాయనా మా ఆకలినీ, చీకటినీ పోగొట్టింది ! అవును.... పేదవాళ్ల కష్టం నీ వంటివాడికే

తెలుస్తుంది ! చెప్పు, నాయనా ! అప్పటినించి ఏం చేశావో, చెప్పు....అప్పుడప్పుడు వీథిలాంతగే గుర్తుకు వస్తుంటుంది నాకు.

చ లం

ఇదుగో తాతా దీన్ని చూడు.

[చలం ఒక పాత వీధిలాంతరుని మేజామీద పెడతాడు. తాత దాన్ని స్పృశిస్తాడు. ఆశ్చర్యంగా ఎలక్ట్రిక్ బల్బువేపూ లాంతరు వేపూ చూస్తుంటాడు]

తా త

ఏంవిటి నాయనా ఈ రహస్యం, చెప్పు!

చ లం

తాతా !నేను చదివిన చదువంతా ఈ దీపాలను గురించే ! నీలాంటి నాలాంటి పేదవాళ్ల బ్రతుకూ మురికివీథుల్లో మసగ్గా వెలిగే దీపాల బ్రతుకూ చూశాను. అనుభవించాను. ఆ దుఃఖకరమైన జీవితాన్ని మార్చటానికే పెద్ద పెద్ద చదువులు చదివాను. ప్రజల్లో పనిచేశాను. వీథిలాంతరుస్థానే విద్యుద్దీపాన్ని తయారు చేశాను. ఆకలి, దరిద్రం ఉన్నచోట్ల ఆనందం, ఆరోగ్యం ఉండేందుకు పనిచేశాను. ఆనాడు వీథిలాంతరువద్ద చదువుకున్న ఆ చలాన్నే-ఈనాడు చైర్మన్ చలాన్ని.

తా త

ఎంత సంతోషం నాయనా! ఎక్కడి మురికి వీథులు అక్కడే మాయమయ్యాయి. పల్లెటూరు పట్నం అయింది. ఎంతమార్పు! కలలాగా ఉంది! నా కళ్లతో ఈ స్వర్గం చూడకలిగాను. ఇక చచ్చిపోయినా పర్వాలేదు.

చ లం

లేదు తాతా! నువు చనిపోవడానికి వీల్లేదు. పదేళ్ల క్రితం ఈ ప్రదేశం ఎలాంటి నరకమో, ఇప్పు డెలా మారిపోయిందో పొరుగువాళ్ళకి తెలియజేసేందుకు - నువు పదికాలాలపాటు ఇంకా బ్రతికి వుండాలి! స్వర్గం మనకేకాదు. అందరికీ కావాలిగా తాతా! ఇక వీథి లాంతరుని మన మ్యూజియంలో ఉంచుతాను. పదేళ్ల క్రితం మనం ఎలాంటి మసకచీకట్లో ఉన్నామో ఈ దీపం తార్కాణం చూపుతుంది. ఇదంతా ఒక మహా చరిత్ర, తాతా! ఈ చరిత్రతో జరిగే అద్భుత పరిణామాలకు సాక్షులుగా నీవూ, ఈ లాంతరూ పదికాలాలపాటు వుండాలి. రేపు మా బిడ్డలకు, తరతరాలకు ఈ మార్పులు ఎవరు చెబుతారు? మనలాగా

జీవిస్తున్న అనేక వేలు లక్షలమంది తోటివారికి, ఈ దీపాల చరిత్ర, ఈ మహత్తర చరిత్ర ఎవరు చెబుతారు? తాతా! నువ్వూ, ఈ లాంతరే చెప్పాలి!

తాత

తప్పకుండా బ్రతుకుతాను, చెబుతాను, నాయనా! నరకంనించి స్వర్గం ఎలా నిర్మించబడుతుందో, బురదలో పద్మం ఎలా వికసిస్తుందో చెప్పడానికి నేను బ్రతికే ఉంటాను. తప్పకుండా బ్రతికే ఉంటాను!

